Regd. No. HNL: 18 27.8.1993 శుక్రవారం 12 పుటలు సంపుటి : 64 సంచిక : 35 విడిప్రతి : రు. 2.00 పై
స్థాపకుడు:నెల్లూరు వెంకట్రామానాయుడు
# జమీన్‌రైతు
జీవప్రదాత:నెల్లూరు శ్రీరామమూర్తి

# కసాయి కడపలో ఏ గడప ఎక్కి చూసినా కన్నీళ్ళే!

కడప పేరు చెప్తే ముందుగా జ్ఞాపకానికి వచ్చేది కరువు; ఆ తర్వాత కసాయి తనం. తరతరాలుగా కడప జిల్లాలో కరువుకు, కసాయి తనానికి విడదీయరాని లంకె వుంది. ఒక్క కడప అనే ఏమి, మొత్తం రాయలసీమలోనే ఆ రెండింటి అనుబంధం విడదీయరానిది. ప్రభుత్వాలు ప్రాజెక్టులు కట్టి కరవును పారద్రోలజూస్తే, నాయకులకది కొత్త కొత్త బాంబులు కనిపెట్టి కసాయి తనాన్ని పదిలంగా కాపాడుకొంటూ వస్తున్నారు. చంపడం, చావడం అక్కడ వీరత్వ లక్షణం, నాయకుల వ్యాపకం, కొందరికది వ్యాపారం, ఎందరికో వాటి పై వ్యామోహం.

కరవు వల్ల పైర్లు, పంటలు కళ్ళ ముందు నాశనమౌతుండడంతో కల్గే ఆర్థిక వెతలు, మానసిక చింతలు అక్కడి వారిలో హృదయ కాఠిన్యం పెంచినట్లున్నాయి. ఎటు చూసినా లేమి, అందువల్ల అవిద్య, దానితో అజ్ఞానం. ఇవన్నీ వెరసి ఇళ్లలో చిక్కులు, చికాకులు, వున్న కొంచెం కాపాడుకోవడం కోసం పోరాటం, ఆరాటం, వానలు పడనప్పుడల్లా, పైర్లు ఎండినప్పుడల్లా అంతులేని ఆవేదన. రేపటిపై క్షీణించి పోయే ఆశ, భవిష్యత్‌లోకి తొంగి చూస్తే కన్పు పొడుచుకున్నా కానరాని గాఢాంధకారం, నిరాశ, నిస్పృహ, వీటన్నింటి వల్ల చెదరిన మనస్సు అకారణ కోపం.... అవే ఈ అనవసర వైరాలకు దారి తీసి వుంటాయి. బ్రతుకును బాగు చేసుకోలేని నిస్సహాయతతో, నిర్వేదంతో నిర్భాగ్య గ్రామీణులు తోటి మనిషిపై కసాయితనం ప్రదర్శించి కసి తీర్చుకునే మానసిక వైకల్యానికి గురౌతుంటారు. వారిలోని ఈ బలహీనతను కనిపెట్టి, రెచ్చగొట్టి, కేసులలో ఇరికించి, పదవీ ప్రాబల్యం కోసం తామాడే చదరంగంలో వారిని పావుల్లాగా మార్చి, రక్తపుటేర్లు పారించే నాయకులు కోకొల్లలుగా తలెత్తడం రాయలసీమ ప్రజలు చేసుకున్న దౌర్భాగ్యం. వారికి కరవు కాటకాలు దేముడిచ్చిన శాపాలైతే, కక్షలు కార్పణ్యాలు నాయకులు సృష్టించిన పాపాలు.

కడప, కర్నూలు, చిత్తూరు, అనంతపురం జిల్లాలు నాలుగింటిలోనూ మనిషిని ముక్కలు, ముక్కలుగా నరికి చంపి, వినోదించే ఆటవికులున్నారు. రాక్షస జాతిగా చెప్ప దగిన మానవ సంతతి అక్కడ నివశిస్తున్నది. కత్తులు, గండ్రగొడ్డళ్లు, వేటకొడవళ్లు, తుపాకులు, బాంబులు వారికి ఆట వస్తువులు. ఎన్ని గ్రామాలలోనో రక్తపు టేరులు పారుతుంటాయి; ఎన్ని వూళ్లలోనో కుళ్లిన మనిషి మాంసపు దుర్గంధం ముక్కు పుటాలను బ్రద్దలు చేస్తుంటుంది.; ఎన్నివేల కుటుంబాలలోనో అప్తుల దారుణ మరణాలను చూసిన ఆవేదన రగులుతుంటుంది; ఎందరో ఆడపడుచులు వైధవ్యంతో, జీవనాధారం కోల్పోయి విలపిస్తుంటారు. ఈ హృదయ విదారక సన్నివేశాలేవీ రాయలసీమ నాయకులలో పరివర్తన తేవు, తెలేవు. ఎర్రటి గులాబి పువ్వును చూసినంత ప్రశాంతంగా రక్తంతో తడిసి జీవం

కొరవ 2 పేజీలో

## హత్యలు 86, కేసులు 200 నిరూపణైంది ఒక్కటీ లేదు!

జమ్మలమడుగు శాసనసభ్యుడు స్వర్గీయ శ్రీ శివారెడ్డికి మొత్తం 86 హత్య కేసులతో ప్రత్యక్ష లేదా పరోక్ష సంబంధం వుందని పోలీసు ఒక జాబితా తయారు చేసినట్లు తెలుస్తుంది! ఇందులో 6 కేసుల్లో ఆయన మొదటి ముద్దాయి. శివారెడ్డి పైన 5 గ్రామాలు దగ్ధం చేసినట్లు ఫిర్యాదు లున్నాయి. ఆయన పైన కాని, ఆయన అనుచరుల పై కాని మొత్తం 200 కేసులు పెండింగ్‌లో వున్నాయి. ఒక్క కేసు విచారణా పూర్తి కాలేదు – ఒక్క దానిలోనూ శిక్ష పడలేదు. అందువల్లే శివారెడ్డికి కడప హింసతో ప్రత్యక్ష సంబంధం వుందని అందరికీ తెలిసినా, ఆయన్ను హంతకుడిగా పేర్కొనడానికి లేదని పోలీసులు చెప్తున్నారు. ఆయన పై వున్న ఆరోపణలన్నీ వదంతులే – ఆధారాలతో నిరూపించ దగినవి కన్పించడం లేదు. నిజం ఆయనకు తెలుసు, అనుభవించిన వారికి తెలుసు అంతే.

## కుటుంబాని కొక్కరుగా 12 మందితో ఆత్మాహుతి దళం

8 తేది హైదరాబాద్‌లో దారుణ మరణానికి గురైన జమ్మలమడుగు శాసనసభ్యుడు శ్రీ శివారెడ్డిని హతమార్చడం కోసం చాలా పెద్ద కుట్రే జరిగింది. శివారెడ్డి బాధిత కుటుంబాలలో నుంచి పన్నెండు మందిని ఎంపిక చేసి ఆత్మాహుతి దళంగా ఏర్పర్చారు. ఒక్కొక్క కుటుంబం నుంచి ఒక్కొక్కరికి ఈ 'ఛాన్సు' లభించిందట. ఎంతో మంది ఉత్సాహంగా ముందుకు వచ్చినా సూసయిడ్ స్క్వాడ్ సంఖ్య పెరిగితే రహస్యాలు కాపాడడం కష్టమని పన్నెండు మందికి పరిమితం చేశారట. హత్య తర్వాత కోర్టు కేసులు ఎదుర్కోవడానికి, హత్యా సమయంలో ఎవరైనా మరణించడం జరిగితే వారి కుటుంబాన్ని ఆదుకోవడానికి పన్నెండు లక్షల రూపాయలు మారు పేర్లతో వివిధ బ్యాంకులలో డిపాజిట్ చేశారట. ఈ నిధికి శివారెడ్డి బాధిత కుటుంబాలన్నీ తమ వంతు విరాళిలిచ్చా యంటారు. తమ కుటుంబం నుంచి ఒకర్ని త్యాగం చేయడానికి సిద్ధపడినాడంటే వారి మనసు లెంత పగతో వుండి పోతుండినామో !

# అందరి కంటే పెద్ద ముఠా నాయకుడు ముఖ్యమంత్రే!

హత్యా రాజకీయాలు కడపకే పరిమితం కాదు – అంతకు రెట్టింపుగా, అంతకంటే రక్తసిక్తంగా కర్నూలులోనూ నడుస్తుంటాయి. ప్రస్తుత ముఖ్యమంత్రి శ్రీ కోట్ల విజయభాస్కర రెడ్డి కర్నూలులో అతి పెద్ద ముఠా నాయకుడు. ముఠాల నిర్వహణలో ఆయనకున్న అనుభవం, సీనియారిటీ మరే రాయలసీమ నాయకుడికీ లేవు. ఈ పెత్తనం ఆయనకు వారసత్వంగా వచ్చింది.

యాభై అరవై ఏళ్ల క్రితం విజయభాస్కర రెడ్డి తండ్రి స్వర్గీయ పెదనాగిరెడ్డికి, ప్రస్తుత ఎమ్మెల్యే శ్రీ కె.ఇ. కృష్ణమూర్తి తండ్రి శ్రీ మాదన్నకు ఏదో విషయంలో స్పర్థ మొదలైంది. అప్పటి నుంచి ఈ రెండు కుటుంబాలూ కత్తులు నూరుకొంటూనే వున్నాయి; బాంబులు పేల్చుకుంటూనే వున్నాయి. ప్రైవేటు సైన్యం రక్షణ లేనిదే ఇటు కెఇ, అటు కోట్ల ఇంట్లో నుంచి అడుగు బయట పెట్టరు. వీరిద్దరి అనుయాయుల మధ్య ఎన్నోసార్లు ఘర్షణలు జరిగాయి; హత్యలు జరిగాయి; కాని వీరికి మాత్రం ఏ ప్రమాదమూ జరగ లేదు. ఈ రెండు కుటుంబాలను కలపడానికి ఎందరో, ఎన్నిసార్లో ప్రయత్నించారు. కానీ అవన్నీ పైపై మెరుగులుగా పని చేశాయే తప్ప క్రింది స్థాయిలో అనుచరుల మధ్య సామరస్యం కుదరలేదు. ఇప్పటికీ కర్నూలులో, ఆ మాట కొస్తే మొత్తం రాయలసీమలో అతి పెద్ద ముఠా నాయకుడు విజయభాస్కర రెడ్డి గారే.

కర్నూలులో శ్రీ గంగుల ప్రతాప రెడ్డి, శ్రీ నాగిరెడ్డి, శ్రీ చల్లా రామ భూపాల్ రెడ్డి, శ్రీ చల్లా

కొరవ 7 పేజీలో

రాష్ట్రమంత్రి వర్గ విస్తరణ పై కోట్ల దృఢ నిర్ణయం

# ఇంక ఆగేది లేదు!

రాష్ట్ర మంత్రి వర్గం మార్పులు, చేర్పుల్లో ముఖ్యమంత్రి శ్రీ కోట్ల విజయ భాస్కర రెడ్డి తలమునకలై వున్నారు. పదకొండు నెలలుగా పెండింగ్‌లో వున్న మంత్రి వర్గ విస్తరణ పై రోజు రోజుకు వత్తిడి పెరుగుతున్న నేపథ్యంలో ఈ నెలాఖరులో గానీ, లేదా వచ్చే నెల మొదటి వారంలోగా 'విస్తరణ'ను పూర్తి చేయాలని ముఖ్యమంత్రి భావిస్తున్నారు. ఈ నెలాఖరులో కేంద్ర మంత్రి వర్గ విస్తరణ జరగాల్సి వుంది. బహుశా ఆ విస్తరణను పూర్తి చేసుకొని ప్రధాని శ్రీ పి.వి. నరసింహా రావు సెప్టెంబర్ 1 తేదీన నెల్లూరు జిల్లా శ్రీహరికోట రాకెట్ కేంద్రానికి వస్తున్నారు. కేంద్ర మంత్రి వర్గ విస్తరణ, ప్రధాని రాష్ట్ర పర్యటన చూసుకున్న తర్వాత రాష్ట్ర మంత్రి

మా హైదరాబాదు విలేఖరి

వర్గాన్ని విస్తరిస్తే బాగుంటుందని సన్నిహితులు చెబుతుండడంతో ముఖ్యమంత్రి పునరాలోచనలో పడ్డారు. ఏది ఏమైనా వచ్చే నెల మొదటి వారంలోగా మంత్రి వర్గాన్ని విస్తరిస్తారని ముఖ్యమంత్రి సన్నిహిత వర్గాలు గట్టిగా చెబుతున్నాయి. ఇప్పటికే రాష్ట్ర మంత్రి వర్గం – మార్పులు చేర్పుల విషయమై ముఖ్యమంత్రి ఒక నిర్ణయానికి వచ్చారట.

ముఖ్యమంత్రి ఇటీవలి ఢిల్లీ పర్యటనలో ప్రధానిని కలసి మంత్రి వర్గ విస్తరణ విషయమై చర్చించారు. విస్తరణలో 'రెడ్డి' కులస్తులను తగ్గించి ఇతర కులం వారికి ప్రాతినిధ్యం కల్పించాలని ప్రధాన మంత్రి సూచించినట్లు తెలుస్తోంది. అ

కొరవ 10 పేజీలో

## రవిక వెనుక దాగిన దేమిటి?

(చాళికే పీచే క్యాహై పాట పై ఆసక్తి దాయక కథనం 9 పేజీలో)

**రక్తంతో తడవని గ్రామం లేదు! బాంబు ప్రేలని వూరు లేదు!**

# కరువు కాటకాలు దేముడిచ్చిన శాపాలు–
# కక్షలు, కార్పణ్యాలు ముఠా నాయకుల పాపాలు!

(మొదటి పేజీ కొరవ)

కోల్పోయిన అనుచరులు, ప్రత్యర్థుల శిబిరాలను చూడగలరు వారు. నలిగిన పువ్వును చూసి తల్లడిల్లే తెలుగు సంస్కృతి, హృదయ మార్దవ్యం



### ముఠాలకు పితామహుడు

డాక్టర్ వై.ఎస్. రాజశేఖర రెడ్డి తండ్రి, శ్రీ రాజారెడ్డి కడప ముఠాలకు పితామహుడి వంటి వారు. హింసాత్మక రాజకీయాలకు పులివెందలను రాజధాని చేశారాయన. ఒక దశలో రాజశేఖర రెడ్డి తన తండ్రి అరాచకాల పట్ల అసంతృప్తి ప్రకటించి, అలిగి, కడపలో కాపురం పెట్టారు కూడా! వైఎస్ పెత్తనానికి వచ్చిన తరువాత రాజారెడ్డి స్పీడు తగ్గింది.

వారిలో కాగడా వేసి వెతికి చూసినా కన్పించవు. అదొక వింత ప్రపంచం, వికారమైన లోకం, క్రూరత్వం నిండిన విశ్వం.

నాలుగు రాయలసీమ జిల్లాలలోనూ కడపదే మరీ ఘోరం.



### కొత్తతరం ముఠా పెత్తనం

అనంతపురంలో కొత్త తరం ముఠా ఏర్పాటుకు కృషి చేస్తున్న జెసి ప్రభాకర రెడ్డి, మంత్రి శ్రీ దివాకర రెడ్డికి సోదరుడు. ఈ రోజు అనంతపురంలో ఆయనమాటకు ఎదురు లేదు.

ఇక్కడ జమ్మలమడుగు, పెద్ద ముడియం, ముద్దనూరు, కొండాపురం, మైలవరం, ప్రొద్దుటూరు, చాపాడు,

సింహాద్రిపురం, తొండూరు, లింగాల, రైల్వే కోడూరు, చిట్వేలు, పులివెందుల, మైదుకూరు, ఖాజీపేట, వెన్నూరు మండలాలలోని పలు గ్రామాలు ఇటువంటి కక్షలు, కార్పణ్యాలతో కుతకుత ఉడుకుతున్నాయి

ఈ మండలాలలోని ప్రతి గ్రామంలో రెండు వర్గాలుంటాయి. రెండింటి మధ్య వచ్చు గడ్డి వేస్తే భగ్గుమంటుంది. చాలా స్వల్ప కారణాలతో వీరు తగువులు పెట్టుకొని, కత్తులు నూరి, కుత్తుకలు తెగ నరుక్కుంటారు.

పెత్తందార్ల ప్రధాన వ్యూహం వారికున్న పండ్ల తోటలు, పైర్లు, పంటలను ధ్వంసం చేయించేస్తారు. కాపుకొచ్చిన మామిడి, సపోటా, నారింజ చెట్లను రాత్రికి రాత్రి రంపాలు పెట్టి కోయించేస్తారు. తోటల ఫలసాయం అమ్మి లక్ష, రెండు లక్షలు గ్రామ నాయకుడి చేతిలో చేరితే తమ పై దాడి తప్పదన్నది ప్రత్యర్థుల భయం. శారీరకంగా చంపడానికి వీలులేని పరిస్థితులలో ఆర్థికంగా చితక గొట్టి, వారి దాడి శక్తిని నిలువ

ఈ దుర్మార్గాన్ని నివారించడానికి హైదరాబాదు సిఐ ఆఫీసులో టెండరు బాక్సులు పెట్టినా ఫలితం కలుగలేదు. అక్కడా తుపాకులు చూపించి, పెట్టెలు ఎత్తుక పోయారు.

సారాయి, విస్కీ వ్యాపారాలలో ముఠా నాయకులు తమ కంటూ సామ్రాజ్యాలు నిర్ణయించుకొంటారు. ఒకరి దానిలో ఇంకొకరు వేలు పెట్టరు. ఎవరూ సేల్స్ ట్యాక్స్, ఎక్సైజ్ పన్నులు కట్టరు. సాధారణ బ్రాందీ అంగళ్లలో కూడా బిల్లులు, గిల్లులు వ్రాయరు. ఏ అధికారికి వారిని

## హత్యకు కారణమే వుండదు!

పొలాలకు వెళ్లి డొంకలో ఒకేసారి రెండు ఎద్దుల బండ్లు ఎదురెదురుగా వస్తే, ఎవరు ప్రక్కకు తగ్గి ఎవరికి దారి ఇవ్వాలనే స్వల్ప విషయం పై పేచీ పెట్టుకొని హత్యలు చేసుకున్న సంఘటన లున్నాయి; స్కూళ్లు, కాలేజి వార్షికోత్సవాలలో పిల్లల మధ్య జరిగే చిన్న చిన్న తగాదాలను పెద్దలు పట్టించుకొని బాంబులు విసురు కున్న దృష్టాంతాలున్నాయి; పొలాల్లో కంచెల దగ్గర, పశువుల దగ్గర గిల్లి

ంచడం ఒక ప్రధాన లక్ష్యంగా వుంటుంది. -

ముఠా నాయకులు పది నుంచి యాభై అరవై గ్రామాల వరకు తమ అదుపులో వుంచుకొంటారు. వై.ఎస్. రాజా రెడ్డి వంటి పెద్ద ముఠాల చేతిక్రింద పది, పదిహేను మండలాలే అణగి మణగి పడివుంటాయి. జిల్లాలో రాజకీయం, సకల సబ్బందు వ్యాపారాలూ ముఠా పెద్దల ఆధీనంలోనే వుంటాయి.

పరీక్షించే ధైర్యం వుండదు. సారాయి వేలం పాటలు నామ మాత్రంగా జరుగుతాయి. కొన్ని కోట్ల రూపాయల పన్నుల ధనం ముఠా నాయకుల చేతికి చేరుతుంది. దొంగ సారాయి, విస్కీ గోడౌన్లకు ముఠా నాయకులు రక్షణ కల్పిస్తారు. ఎవరైనా అధికారి వాటిని సమీపిస్తే ప్రాణాలతో తిరిగి వెళ్లడం అసాధ్యం. అంతా సినిమా పద్ధతిలో వుంటుంది.

## పోలీసులు పేరుకే వుంటారు!

కజ్జాలు పెట్టుకొని రక్తపుటేర్లు పారించిన సన్నివేశాలున్నాయి. హత్యల వరకు దారితీసే కక్షలకు కారణమనేది సాధారణంగా వుండదు. ఏదో ఒక సాకు వెతుక్కొని వేట కొడవళ్లు బయటకు తీస్తారు, అంతే!

గ్రామాలలో వర్గ కక్షలున్న వారు మండల, తాలూకా స్థాయి ముఠాలతో అనుబంధిత మౌతుంటారు. ఈ ముఠాలకు రాజకీయ నాయకులు పెత్తనం వహిస్తారు. గ్రామాన్ని

కాంట్రాక్టులు, సారాయి, గంధం, రక్త చందనం వంటి వాటి స్మగ్లింగ్; సున్నపురాయి, బరైటిస్ గనులు అటవీ సంపదల అక్రమ విక్రయాలు; మట్కా జూదశాలల నిర్వహణ, చవక బారు విస్కీ తయారీ, అమ్మకాలు ముఠా నాయకుల ప్రధాన వ్యాపారాలు. కడప జిల్లాలో ఏ ప్రాజెక్టు పనికి కాంట్రాక్టు కావాలన్నా ఏదో ఒక నాయకుడి అండ వుండాలి. టెండరు సమయంలో వివిధ ముఠా నాయకులు తమ ప్రైవేటు

బరైటిస్ గనులలో నుంచి వెలికి తీసే సరకు వేల టన్నులకు వుంటే, కట్టే రాయల్టీ వందల టన్నుల్లో వుంటుంది. లైసెన్సు ఇచ్చిన భూములు పదిలంగా వుంచుకొని, ప్రక్కనే వుండే ప్రభుత్వ భూములలో త్రవ్వేస్తారు. అదేమని అడిగే సాహసికులు ఎవ్వరూ ఇంకా పుట్టలేదు.

ఇట్లా వివిధ రూపాలలో సంపాదించే ధనం వెచ్చించి తుపాకులు, బాంబులు కొంటారు.

## మహిళలూ బాంబులు వేయడం మామూలే

రెండుగా చీలగొట్టి, కక్షలు పెంచి, చిన్న చిన్న సంఘటనలను పెద్దవి చేసి, కేసులో ఇరికించి, ఒకసారి తమ దగ్గరకు వచ్చిన వారు ఇక ఎట్టి పరిస్థితులలో వదలి వెళ్లలేని, వెళ్తే బ్రతకలేని పరిస్థితి కల్పిస్తారు. సాధారణంగా గ్రామస్థాయి కక్షల్లో వేట కొడవళ్లు, కత్తులు, గండ్రగొడ్డళ్లు వాడుతారు. వారి ఆర్థిక స్తోమత అంతంత మాత్రంగా వుంటుంది. ఒక్క కేసుల్లో, ఇరుక్కోగానే పోలీసులు లాయర్లు కలసి వారి ఆస్తి సంతటినీ కరగించి వస్తారు. ఆ తర్వాత కక్షల కొనసాగింపుకు ముఠా నాయకుల ఆసరా తప్పని సరి అవుతుంది. ఆర్థికంగా గ్రామస్థాయి నాయకులను నిర్వీర్యులను చేయడం ముఠా

సైన్యాలతో పిడబ్ల్యుడి ఆఫీసులను ముట్టడిస్తారు. బలవంతులైన వారు, కంట్రాక్టర్లందరినీ సమావేశ పరచి ఒక రేటు నిర్ణయించి, తమకు అధిక మొత్తం చెల్లించే వారికి టెండరు వచ్చేట్లు చేస్తారు. ఇంకెవ్వరు టెండరు వేయడానికి సాహసించినా తల ఎగిరి పోతుంది. రహస్యంగా టెండరు వేశారని తెలిస్తే బాక్సులు తగులబెట్టేసి, రీటెండర్లు పిలవాల్సిన పరిస్థితి కల్పిస్తారు. ఈ సిండికేట్ వ్యవహారాల వల్ల 5 నుంచి 15 శాతం వరకు ముఠా నాయకుడికి కమీషన్‌గా ముడుతుంది. తెలుగు గంగ ప్రాజెక్టు వచ్చిన తర్వాత ఒక్కొక్క నాయకుడు 50, 60 లక్షలకు తక్కువ కాకుండా ఆర్జించాడని వినికిడి.

ప్రైవేటు సైన్యాలను తయారు చేస్తారు. ప్రధానమైన ముఠా నాయకుల పోషణలో కనీసం వంద మంది సుశిక్షితులైన ''సైనికులు'' వుంటారు. తుపాకి పేల్చడం, బాంబులు విసరడంలో వారికి శిక్షణ వుంటుంది. నాయకుడు ఎక్కడకు వెళ్తే వీరు అక్కడికి వెళ్తారు. చేతిలో తుపాకి, చేతి సంచిలో బాంబులు రెడీగా వుంటాయి. అత్యధిక భాగం జీపులు వాడతారు. నాయకుడు జీపులో డ్రైవరు ప్రక్కన వుంటే, అనుచరులు రెండో ప్రక్క, వెనుక సీట్లలో కూర్చుంటారు. ముందు వెనుక రెండు జీపులు రక్షణగా కదుల్తాయి. ఇళ్ల దగ్గర షిఫ్టు పద్ధతిలో నిర్ణీత సంఖ్యలో ఎప్పుడూ కొంత మంది కుటుంబ సభ్యులను కాపాడుతుంటారు. ముఠా నాయకుల

పిల్లలను భద్రత కోసం మద్రాసు, బెంగుళూరు వంటి నగరాలలో వుంచి చదివిస్తారు. ఎక్కడా ఎటువంటి రిస్కు తీసుకోరు. వారు చేసే అక్రమార్జనలో ముప్పాతిక భాగం



### కర్నూలు కల్లోల సృష్టికర్త మాదన్న

కర్నూలులో ఐదు దశాబ్దాల నుంచి కోట్ల విజయభాస్కర రెడ్డి కుటుంబంతో వైరం కొనసాగిస్తున్న వ్యక్తి శ్రీ కె. మాదన్న. కర్నూలులో ఇది వరకు జరిగిన ఎన్నో కల్లోలాలకు సృష్టికర్తలు వీరిద్దరే.

భద్రతా చర్యలకే సరి పోతుంటుంది. ఏటా కొన్ని లక్షలు ఖర్చవుతుంటుంది.

గ్రామ స్థాయిలో తమ అనుచరులను కాపాడడం, వారు తమ వ్యక్తిగత కక్షలు తీర్చు కోవాలనుకొన్నప్పుడు వ్యూహం రచించి, కిల్లర్ గ్యాంగ్‌లను పంపి, ప్రత్యర్థులను చంపించడం, పోలీసుల



### రాజశేఖర రెడ్డి అంటే భయం!

డాక్టర్ వై.ఎస్. రాజశేఖర రెడ్డి ముఠా నాయకత్వ దశ నుంచి, ఛారిష్మా కల్గిన నాయకత్వ శ్రేణికి ఎదిగి పోయాడు. గ్రామాలలో అందరి వలె కక్షలు రెచ్చగొట్టకుండా, రెండు వర్గాలనూ రాజీతో కల్పి, తన చేతి క్రింద వుంచు కోవడంలో నిపుణుడాయన. ఒక్క హత్య కేసులో ముద్దాయి కాకపోయినా, రాజశేఖర రెడ్డి పేరు చెప్తే కడపలో పెద్ద పెద్ద ముఠా నాయకులకూ భయమే.

నుంచి బాధ లేకుండా చేయడం, కోర్టు కేసుల్లో ఆదుకోవడం ముఠా నాయకుల బాధ్యతలు. ఇందుకు ప్రతిగా గ్రామ నాయకులు ఎన్నికలు వచ్చినప్పుడు రిగ్గింగ్‌లు చేసి, పెట్టెలు మాయం చేసి ఓట్లు వేయిస్తారు. ప్రైవేటు సైన్యాలకు

కొరవ 7 పేజీలో

# జమీన్‌రైతు

## పరాభవం

రాజకీయాల నుంచి మతాన్ని వేరు చేసే బిల్లును లోక్ సభలో ప్రవేశ పెట్టే దశలో వెనక్కు తీసుకున్నది ప్రభుత్వం. అయోధ్య పరిణామాల తర్వాత, రాముడి పేరు చెప్పి ఓట్లు కొల్లగొట్టడానికి బిజెపి పన్నుతున్న కుట్రలకు బ్రేక్ లాగా ఈ బిల్లులు కనిపెట్టారు ప్రధాని శ్రీ పి.వి.; అయితే బిజెపితో పాటు, నేషనల్ ఫ్రంట్‌లోని పార్టీలన్నీ- సిపిఎం, సిపిఐ మినహా- దానిని వ్యతిరేకించాయి. బిల్లులు ప్రవేశ పెట్టి, దాని పై చర్చ జరిగి, ఓటింగ్‌కు పెట్టినప్పుడు ఓడిపోతే ప్రభుత్వం చిక్కుల్లో పడిపోతుంది. అందులోనూ రాజ్యాంగ సవరణ బిల్లు కాబట్టి, ఓటమి ఎదురైతే రాజీనామా చేయవలసిన పరిస్థితి ఏర్పడవచ్చు. అందువల్ల ఆఖరు నిముషంలో మర్యాదగా ఆ బిల్లులను ఉపసంహరించుకున్నారు. ఈ తిరోగమనం పరాభవం క్రిందే లెక్క అయినప్పటికీ, చిక్కులు తప్పాయి.

కాంగ్రెస్‌కు తగిన మెజారిటీ లేనందువల్ల ఉపసంహరణ తప్పలేదు కాని, రాజకీయాల నుంచి మతాన్ని వేరు చేస్తూ చట్టం చేయడం మాత్రం అత్యంతా వశ్యక విషయం. మనది లౌకిక ప్రజాస్వామ్యం. కాని ఆచరణలో అది జరగడం లేదు; ఆదర్శంగానే మిగిలి పోతున్నది. బిజెపి, ముస్లిం లీగ్ వంటి పార్టీలు బహిరంగంగా మతాన్ని తమ రాజకీయ ప్రయోజనాలకు వాడుకొంటున్నాయి. మత పరమైన నినాదాలు, ప్రతిజ్ఞలు, వాగ్దానాలు మామూలై పోయాయి. దీని వల్ల లౌకిక తత్వం దెబ్బ తింటున్నది. దేశంలో సాంఘిక, రాజకీయ వాతావరణం కలుషితమౌతున్నది. ఈ పరిస్థితులలో మతాన్ని, రాజకీయాన్ని వేరు చేస్తూ సమగ్ర చట్టం చేయడం అత్యంతావశ్యకం.

అయితే ప్రభుత్వం ప్రవేశ పెట్ట జూచిన బిల్లులలో కొన్ని లోపాలున్నాయి. అభ్యర్థి మతం పేరుతో ప్రచారం చేస్తున్నాడన్న ఫిర్యాదు వస్తే విచారించి అనర్హుడుగా ప్రకటించే అధికారం రిటర్నింగ్ అధికారికి ఇవ్వడం అందులో ఒకటి. దీనివల్ల అధికారంలో వున్న తమ ప్రత్యర్థులను అనవసరంగా ఎన్నికలకు దూరం చేసే ప్రమాదం ఏర్పడుతుంది. ప్రధాని శ్రీ పి.వి. ముందుగా ప్రతిపక్షాలతో చర్చించి, సూచనలు స్వీకరించి, సవరణలు చేసి వుంటే ఈ బిల్లులకీ గతి పట్టేది కాదు. ఏకాభిప్రాయసాధన అన్న రామ మంత్రం వేదికల పై జపించడానికి తప్ప ఆచరణకు వాడక పోవడంతోనే తంటా వస్తున్నది. లౌకిక తత్వం కల్గిన పార్టీల సమ్మతి తీసుకొని వుంటే ఇప్పుడీ పరాభవమూ తప్పేది.

## టర్నోవర్ ట్యాక్స్

రాష్ట్ర ప్రభుత్వం కొత్తగా ప్రవేశ పెట్టిన టర్నోవర్ ట్యాక్స్ విషయంలో వ్యాపారుల ఆందోళన సమసి పోవడం లేదు. ఇటు ప్రభుత్వం, అటు వ్యాపార సంఘాలు రెండూ రాజీ లేని ధోరణిలో వ్యవహరిస్తున్నాయి. సెప్టెంబరు 1 తేది నుంచి వ్యాపార సంస్థల నిరవధిక బంద్ ప్రకటించారు.

సారాయి నిషేధం వల్ల ఏర్పడే 1400కోట్ల లోటును భర్తీ చేసుకోవడానికి పన్నులు విధించడం తప్పదన్నది ప్రభుత్వ వాదన. 87 శాతం వ్యాపారాలను టర్నోవర్ ట్యాక్స్ నుంచి మినహాయించి కేవలం 13 శాతం వస్తువుల పైనే పన్ను విధించామని, చిన్న వ్యాపారుల సౌకర్యార్థం పలు పరిమితులను సడలించామని ప్రభుత్వం వాదిస్తున్నది. దీనివల్ల నిత్యావసర వస్తువుల ధరలు పెరగవని, వినియోగదారుడి పై భారం పడదని దబాయిస్తున్నది. అయితే వ్యాపారులు అందుకు అంగీకరించడం లేదు. పరిశ్రమలో ఉత్పత్తిదారుడు, ప్రధాన డిస్ట్రిబ్యూటరు, డీలరు, ఏజెంటు, రిటైలర్‌ల వద్ద పన్నులు దండడం వల్ల ఒక్కొక్క వస్తువు పై 6 నుంచి 8 శాతం వరకు పన్ను పడుతుందన్నది వారి ఆరోపణ. రెండు శాతం మించని లాభాలతో, అధిక టర్నోవర్‌తో వ్యాపారం చేసే సంస్థలు దీనివల్ల మూత పడిపోతాయని; ఒక్క ఆంధ్ర ప్రదేశ్ కోసం ట్యాక్సులు అదనం అన్న ముద్రతో ప్రత్యేకంగా ప్యాకింగ్ తయారు చేయడానికి ఇతర రాష్ట్రాలలోని పరిశ్రమల వారు అంగీకరించ నందువల్ల తూనికలు కొలతల శాఖ వేధింపుకు, వినియోగ దారుల కోర్టుల శిక్షకు గురి కావలసి వస్తుందని వారు భయపడుతున్నారు. పైగా ధరలు విపరీతంగా పెరిగి పోతా యంటున్నారు. టర్నోవర్ ట్యాక్స్‌ను ఇతర రాష్ట్రాల వలె సింగిల్ పాయింట్‌లో అర్థ నుంచి ఒక శాతం వరకు వసూలు చేయడం ధర్మమంటున్నారు. ప్రభుత్వమేమో తన పట్టుదల వీడడం లేదు.

సారాయి పేరుతో ప్రభుత్వం రాష్ట్రంలోని అన్ని వర్గాల ప్రజల నెత్తిన మోయలేని భారం మోపడం దారుణం. లోటును పూరించడానికి పన్నులు వేయడంలో తప్పులేదు. కాని, అది మితిమీరితే ప్రజలు అల్లాడి పోతారు. ఒక్కసారిగా 1400 కోట్ల అదనపు పన్నులు పైనబడితే కోలుకునే దెట్లా? అధికారుల మాటలు నమ్మి, మూర్ఖంగా మొండి పట్టుదలతో వ్యవహరించ కుండా ప్రజల జీవన స్థితిని, వ్యాపారుల కష్ట నష్టాలనూ పరిగణనలోకి తీసుకొని, టర్నోవర్ ట్యాక్స్ పై పునరాలోచన చేయడం అవసరం. సమస్యను ఒక నిపుణుల కమిటీకి నివేదించి, వారి నివేదిక అందినంత వరకు పన్నుల విధింపు వాయిదా వేయాలి.

# జమీన్‌రైతు

27.8.1943

4 పేజీలు 0-1-6 అణా:

### ఏ.ఆర్. కాలేజి ప్రిన్సిపాల్ అధికార దౌష్ట్యం

### కమిటీ ఊబతనం

తొందముదిరి పూసరివిల్లి అయినట్లవుతున్నది. ఏ.ఆర్. కాలేజీ పరిస్థితి. ఆదిలో రగ్బీ -యూటన్ స్కూళ్ల ప్రతిష్ఠ దీనికి కొంత వుండింది. అదిపోతే పోయిందిగాని, ప్రిన్సిపాల్ పుణ్యాన, కమిటి చచ్చుతనంవల్ల, యిక కొన్నిదినాలకు తప్పక అపకీర్తి పాలౌతుంది. కమిటీకి ఆర్భాటపు ఆరాటమేగాని కార్యసాధనగాని అధికారపాలనగాని లేనందున క్రింది వుద్యోగస్థులకు చులకనై బయట వారి నగుబాట్లకు కారణం అయింది. ప్రెసిడెంటు ఏ.సి. సుబ్బారెడ్డిగారిది "అరవైమైళ్ల గలభా - ఆరు మైళ్లస్పీడు" అన్న మోటారు పంథా. గలభా లేవదీస్తారుగాని, చివరకు నీళ్లపాకానికి దిగుతాడు. పాపం ! ఆయన ఏంచేస్తాడులేండి ! అనుయాయులు తక్కువ - వున్నవారు మెతక.

### ప్రిన్సిపాల్ సంగతి దాచడం

ఈ వూబతనం చూచుకొనే ప్రిన్సిపాల్ ఎగసికం పడుతున్నారు. చూడండి - భీమసేనరావు ఉద్యోగపర్వం - రావు అభినవ బిల్హణీయం ఆడబోయి గుంటూరు కాలేజిలో డిస్మిస్ అయిన పురాణ పురుషుడు. ఆయన కర్మకాండను మభ్యపరచిన ప్రిన్సిపాలును అండమాన్సుకు పంపవలసివుండగా - అవరిస్తున్నారు. [illegible] దీని [illegible] ఈ పాల్ ఎందుకు జంకాల ?

### నైతికారణం

[illegible] చెప్పవచ్చిన సంగతేమంటే-గిరోపెన్. పూరగాయకు సైన్సుజాతీల దొంగతనాలు బయట పెట్టింది ఫిజిక్సు ప్రొఫెసర్ మోసెను అనుకొని ఆయన మీద పంతమూనినట్లున్నది ప్రిన్సిపాల్ ముఠా. "అదిహో! తద్వైరమూలం బిలన్" అన్నారు ఒక గ్రంథకర్త. ప్రిన్సిపాల్ -మోసెస కరెస్పాండెన్స్ బయట పెట్టించితే సంగతి తెలుతుంది. దీనికి కమిటీ పూనుకుంటుందా?

## 50 ఏళ్ళ క్రితం ఈ వారం

### బాతాఖానీ

**కుంటి దొరవంటావా నీగతి!**

**ఇవన్నీ చేతావని మార్పులు గావా?**

-చిత్రగుప్తుడు

చేతావని వ్రాతలు అబద్ధమని ఖండించాడు మన రామకృష్ణ సిద్ధాన్తి హరో విలాస్ ముష్పై మాసాల వాడు. ఆ వ్రాతనే అబద్ధమైతే ఈ క్రింది ప్రచండ మార్పులకు కారణమేమిటంటారు?

### 1. గాడిదల ప్రవేశం

### జన్నవాడ దేవళంలో గాడిదల ప్రవేశం-

ఆంధ్రసభా రాణిగారైన సినిమాతార శ్రీ సుబ్రహ్మణ్య కుమారీ దేవిగారికి జన్మ స్థలమైన జన్నవాడ పురంబున ప్రాచీన సుప్రసిద్ధ చారిత్రాత్మకమైన దేవాలయం కొండు గలదు. అదే కొన్నవాడ కామాక్షితాయిగ్ నిలయమైన పినాకినీ పుణ్యనదీతీర దివ్యా లయము. ఇన్నివేల సంవత్సరాలు గడిచినా ఎప్పుడూ గూడ యింత పెద్ద అపచారం జరిగినట్లు ఎక్కడా దాఖలాలు కనిపించవు. ఈమధ్య ఒకనాడు గార్దభములనే గాడిదలు రెండు ఎవరి అనుమతి లేకుండానే దేవాలయ ఆవరణంలోకి చటుక్కున ప్రవేశించి సరాసరి అమ్మవారి సన్నిధికి వెళ్లిపోతున్నవి. ఇంతలోపల సత్యాత్ములరాలు అమ్మవారికి జోడు మంగళ హారతులిస్తుండిన చిర మత్తైదువు లొట్టదవడల భోగం సుబ్బక్క, నట్టం నరసిమ్మ, దాడిఫసంద్ రామకృష్ణయ్య మున్నగు భక్తవ రేణ్యులు చూచి అహింసా సాధకములైన బడితెలు, చీపుర కట్టలు మున్నగు నవీన యుద్ధ పరికరములతో వాటిని తరుముసాగారు. ఆహా వాటి లొట్టన్నా వెళ్లతవిగా ! దేవాలయం చుట్టూ మూడుమార్లు ప్రదక్షణం జేసి, సకిలించి అప్పుడు వెళ్లిపోయినవి. ఈ మహాపచారానికి గ్రామంలో గల నట్టం రంగసాని మొదలు చెంబడి మహాలక్ష్మి వరకుగల భక్త బృందమంతా దద్దరిల్లి పోయినారు. ఆరాత్రి గ్రామ పెద్దలైన మద్దెల యెంకటలక్ష్మి వగైరా విద్యాధికులంతా నిండు కొలువుదీరి చేతావని వ్రాతల ప్రకారం ముందేదో దేశానికి ఉపద్రవం రానున్నదనీ, ఈ గాడిదల వాలకం దానికి చిహ్నమేననీ, వితర్కించుకొని చేతావని పుస్తకం దెచ్చి దాన్ని అర్చించి ధూపదీప నైవేద్యాది విధులతో పూజించి నటువంటి వారలైరి.

# పురాణాలలోని రాక్షసులు మదిలో మెదలుతున్నారు!

శివారెడ్డి జరిపించిన హత్యాకాండ పురాణాలలోని రాక్షస కృత్యాలను గుర్తుకు తెస్తున్నది. డిటెక్టివ్ నవలలో షెర్‌లాక్ హోంస్సు పరిశోధక శక్తి జ్ఞప్తికి తెస్తున్నది - మీరు సేకరించిన ఆ రెడ్డి రక్త పాన వుదంతము వార్త చదువుతున్నప్పుడు చే త నున్న వణి కి పోయిన ద ప్రాంత ప్రజలెట్లా మన గలిగినారా? ఈ సామూహిక హంతకుని శవాన్ని రాజ్‌భవన్‌కు మోసుకొని పోయిన ఆ రామా రావు సంస్కృతిని, అభిరుచిని ఏమనాలనో! ఆయన పూసుకొన్న రంగుల క్రింద వుండే అసలు రంగే ఇది; బయట పడింది.

—మరుపూరు కోదండ రామిరెడ్డి

నెల్లూరు

### ఆర్టీసీ ఆత్మవిమర్శ చేసుకోవాలి

నిన్న చీచపల్లి, నేడు హుసేన్ సాగర్‌లో ఆర్టీసి బస్సులు పడి పోవడం వల్ల 40 మంది జలసమాధి అయిపోయారు. రాత్రి బస్సుల్లో పయనిస్తూ దోపిడి దొంగల బారిన పడి ఎన్ని లక్షల రూపాయలు ప్రజలు కోల్పోయారో లెక్కే లేదు. ప్రమాదాలు సంభవించిన సందర్భాల్లో కంటి తడుపు చర్యగా కమిటీలను నియమిస్తున్నట్లు ప్రకటించి, తరువాత ఆ నివేదికలను బుట్ట దాఖలు చేస్తున్న కారణంగా ప్రమాదాల నివారణా చర్యల కథ మళ్లీ మొదటికే

## జనవాణి

వస్తున్నది. తాజాగా ప్రభుత్వం ముగ్గురు సభ్యుల కమిటీ వేసింది. చీచపల్లిలో మునిగిన బస్సు ఇప్పటికి బయటికి రాలేదు. వచ్చినా అందులోని పరికరాల పరిశీలన, ప్రపంచంలో ఏ సాంకేతిక నిపుణుడి తరం కాక పోవచ్చు. పనికిరాని ట్రిల్ ఎన్‌లైజర్లు, పునశ్చరణ తరగతులు లేని ఆర్టీసి డ్రైవర్లు ప్రజల పాలిట శాపాలే. సంస్థ లాభాలే కాదు ప్రజా సంక్షేమం చూస్తూ మళ్లీ ఇటువంటి సంఘటన పునరావృతం కాకుండా ఆర్టీసి ఆత్మవిమర్శ చేసుకోవాలి.

నెల్లూరు —యద్దనపూడి సరోజిని

### ధరలను నియంత్రించే వారెవరు!

మార్కెట్లో వస్తువుల ధరలు రోజు రోజుకు పెరిగి పోతున్నాయి. నిన్నటి ధర నేడు కాన రావడం లేదు. ప్రభుత్వ విధానాల వల్ల 24 గంటల్లో రేట్లుమారుతాయా? లేక ప్రజావసరాలు పెరిగి రేట్లు పెరిగాయా అన్న విషయం అర్థం కావడం లేదు. సరకు లేక ధరలు పెరగడం లేదు. గోడౌన్లలో కావల్సినంత మేర నిల్వలున్నాయి. కాని నిత్యావసర వస్తువులైన బియ్యం, నూనె, పంచదార, చింతపండు, కోడిగ్రుడ్డు, ప్రతి రోజు పెరిగి పోతున్నాయి. వుదాహరణకు బెల్లం రేటు తీసుకొంటే చక్కెర కన్నా ఎక్కువగా వుంది. అదేమంటే చక్కెర ఫ్యాక్టరీలు కారణమనే కుంటి సాకు చూపిస్తున్నారు. ధరలు విపరీతంగా పెరిగి జీవన ప్రమాణం పెరిగి తలక్రిందులై పోతున్నాము. అసలు ఈ ధరలు పెంచేందుకు గాని నివారించేందుకు గాని అధికారాలు కల్గిన అధికారులు లేరా? వున్నా

కొరవ 7 పేజీలో



# బరితెగించిన బూతు బొమ్మలు

టౌన్‌లోని కొన్ని థియేటర్లలో ప్రదర్శిస్తున్న ఇంగ్లీషు, మలయాళ, తెలుగు శృంగార సినిమాల జాలూకు పబ్లిసిటీకి వుపయోగిస్తున్న వాల్ పోస్టర్లలోని బొమ్మలు మరీ బరితెగించి పోతున్నాయి. కాలేజీ రూడళ్లు, బస్ స్టాపింగులు, జనం క్రిక్కిరిసి నడిచే రోడ్ల పైన ప్రదర్శిస్తున్న ఈ పోస్టర్ల వల్ల ఆ దారిన నడిచే యువతులు తలెత్తుకోలేని స్థితి దాపురించింది. గత ఆరు నెలల నుంచి మరీ శృతి మించిన ఈ శృంగార చిత్రాల ప్రదర్శనలను, పోస్టర్లను అరికట్టే విషయంలో జిల్లా అధికారుల వుదాసీనత అటుంచితే, ప్రపంచ వ్యాప్త పేరు గాంచిన సారా వుద్యమానికి వూపిరి పోసిన మహిళా సంఘాల

**మహిళా సంఘాలు మళ్లీ ఉద్యమించాలి**

నాయకులూ పట్టించు కోవడం లేదు. కేవలం పబ్లిసిటీయే పెట్టుబడిగా, రసిక హృదయ శిఖామణులతో పాటు అమాయకులైన పిల్లలనూ ఆకర్షించే సినిమాలు ప్రదర్శించే రెగ్యులర్ థియేటర్లు టౌన్‌లో ప్రస్తుతం రెండున్నాయి. మరో వీడియో థియేటర్ కూడా వీటికి జత కలిసింది. అడపా దడపా మరో రెండు థియేటర్లు ఈ ప్రదర్శనలు సాగిస్తుంటాయి. పెద్ద హీరోల చిత్రాల మాదిరి కలెక్షన్స్ వుండడం, ఫిలిమ్ బాక్సులు తక్కువ

కొరవ 11 పేజీలో

# బాల్ బ్యాడ్మింటన్‌లో నెల్లూరు పరువు నిల్పిన బాలికలు!

జిల్లా క్రీడా సంస్థ కనీస ప్రోత్సాహం అందివ్వక పోయినా జిల్లా మహిళల జట్టు ప్రకాశం జిల్లాలో జరిగిన అంతర్ జిల్లా బాల్ బ్యాడ్మింటన్ పోటీల్లో రెండవ స్థానం పొంది తమ ప్రతిభ చాటారు. గతవారం జరిగిన పోటీల్లో విజయం సాధించిన జట్టులో శోభారాణి, పి. శ్రీలత, పద్మావతి, దేవి, సునీత, ప్రసన్నలక్ష్మి, రాధా చక్కని పోరాట పటిమ చూపి విజయం సాధించారు. ఈ జట్టుకు కోచ్‌గా బుచ్చినాయుడు, మేనేజర్‌గా పి. అరుణ కుమారి వ్యవహరించారు. జట్టుకు పి.ఇ.టి. శేషయ్య చక్కని శిక్షణ నిచ్చారు.

## తపాలా ఉద్యోగుల సభ

భారతీయ యూనియన్ ఆధ్వర్యంలో ఎ.కె. నగర్ పోస్టాఫీసులో 22 తేదీ తపాల ఉద్యోగుల సభ జరిగింది. ఎ.కె. నగర్ ఎస్.పి.ఎం. జి.వి. కృష్ణయ్య అధ్యక్షత వహించారు. సమావేశంలో పాల్గొన్న సభ్యులు ఇ.డి. వుద్యోగులకు జరుగుతున్న అన్యాయాన్ని ప్రభుత్వం తక్షణం చర్చించి వారికి డిపార్టుమెంట్ వుద్యోగులకు ఇచ్చే సౌకర్యాలు కల్పించాలని కోరారు. ఇ.డి. వుద్యోగులకు పని పెరగడం తప్ప జీతభత్యాలు పెంచక పోవడం పట్ల ఆవేదన వ్యక్తపరిచారు. టౌన్‌లో గ్రూప్ 1 పోస్టుమెన్ వుద్యోగులను పెంచాలని, పార్సెర్లు మెయిల్ అరేంజిమెంటు పేరున మార్పు చేసిన ఇ.డి. వుద్యోగులను తిరిగి తీసుకోవాలని సభ తీర్మానం చేసింది. సమావేశంలో ఇ.డి. ఉద్యోగుల సంఘం అధ్యక్ష కార్యదర్శులు వి. మాధవ రావు, బాలాజి తదితరులు మాట్లాడారు.

**నెల్లూరు సంగతులు**

## 29 న మహిళా మణుల అష్టావధానం

'ముదితల్ నేర్వగ రాని విద్య కలదే ముద్దార నేర్పించినన్' అని ఏనాడో సెలవిచ్చినా, సాహితీ సర్కస్ అన దగ్గ అష్టావధాన కార్యక్రమం మాత్రం ఇప్పటి వరకు మగవారి సొత్తుగానే వుంది. మొత్తం మహిళలే అష్టావధానం నిర్వహించిన సాదృశ్యం మనకు తెలిసి ఎక్కడా లేదు. ఆ లోటును వర్తమాన సమాజం 29 తేది పూరిస్తున్నది. కాజీపేట రైల్వే జూనియర్ కాలేజి లెక్చరర్ శ్రీమతి ఎం.కె. ప్రభావతి నేతృత్వంలో 8 మంది మహిళా పృచ్ఛకులు ఈ సరికొత్త కార్యక్రమం నిర్వహించనున్నారు. శ్రీమతులు సి. వసుంధర, ఎన్. సుబ్బులక్ష్మి, సి. సీతా మహాలక్ష్మి, లలితమ్మ, పి. ప్రమీలతో పాటు కుమారి సి. ఆదిలక్ష్మి ఎం.గిరిజలు తన ప్రతిభ చాట నున్నారు. సాహితీ వేత్త డాక్టర్ బెజవాడ గోపాల రెడ్డి అధ్యక్షత వహించే ఈ అపురూప కార్యక్రమంలో కళాప్రపూర్ణ మరుపూరు కోదండ రామిరెడ్డి కూడా పాల్గొంటారని, కొత్త ప్రక్రియను కనులారా వీక్షించేందుకు ఆదివారం తరలి రమ్మని సాహిత్యాభిమానులను వర్తమాన సమాజం కోరుతున్నది.

## రాజీవ్ గాంధీ జయంతి

స్వర్గీయ రాజీవ్ గాంధీ 50 వ జయంత్యుత్సవ సభను ఇందిరా భవన్‌లో డి.సి.సి. 20 తేది ఘనంగానే జరిపింది. ఎమ్మెల్యేలందరికీ డి.సి.సి. ఆహ్వానాలు పంపిందో లేదో తెలియదు గాని, ముఖ్య అతిథిగా విచ్చేసిన మాజీ ముఖ్యమంత్రి శ్రీ ఎన్. జనార్దన రెడ్డి, సర్వేపల్లి ఎమ్మెల్యే శ్రీ సి.వి. శేషారెడ్డి మినహాయించి ఇంకెవ్వరూ ఆ వైపు తొంగి చూడలేదు. శ్రీ జనార్దన రెడ్డి తొలుత స్వర్గీయ ఇందిరా గాంధీ, రాజీవ్ గాంధీ చిత్ర పటాలకు పుష్ప మాలలు వేసి శ్రద్ధాంజలి ఘటించి, మాట్లాడారు. దేశం విప్లవాత్మకమైన ఆలోచనలతో శాస్త్ర, సాంకేతిక రంగాల్లో పురోభివృద్ధి సాధించాలని రాజీవ్ గాంధీ కలలు కనేవారు. అదే బాటలో నేటి యువతరం నడచి ఆయన కలలను నిజం చెయ్యాలి. జాతీయ వ్యవసాయ విధానం, పారిశ్రామిక, ఆర్థిక విధానాలకు రూప కల్పన చేసి దేశాన్ని 21వ శతాబ్దానికి తీసుక పోవాలని తపన చెందిన మహానుభావుడు రాజీవ్ అని చెప్పారు. ప్రస్తుత పరిస్థితుల్లో విప్లవ నాయకత్వం కావాలి; విప్లవమంటే కమ్యూనిస్టులు చెప్పే విప్లవం కాదు. వారు ఇతర దేశాలను అక్కడి పరిస్థితులను ఆదర్శంగా చూపుతూ ఈ దేశాన్ని బాగు పరచాలని ప్రవచిస్తుంటారు; కాని అటువంటి విదేశీ భక్తి అవసరం లేదు – ఇక్కడి పరిస్థితులు, సంప్రదాయాలు దృష్టిలో పెట్టుకొని పనిచేస్తె సత్ఫలితాలు సాధించ వచ్చని శ్రీ జనార్దన రెడ్డి స్పష్ట పరిచారు. దేశాభివృద్ధికి ఎటువంటి పాలసీలు వుండాలన్న విషయం కాంగ్రెస్ పార్టీకి

కొరవ 8 పేజీలో

## సంతాపం

మా తండ్రిని మించి
మమ్ము తీర్చిదిద్దిన మా పినతండ్రి

**ఈపూరు నారాయణ రెడ్డి గారు**

22.8.93 తేది స్వర్గస్థులైనారు.

వారి ఆత్మకు చిరశాంతిని కలుగజేయమని భగవంతుని ప్రార్థిస్తున్నాము.

జననం :1904



కుమారులు
ఈపూరు వెంకురెడ్డి
గడ్డూరు వారి పాళెం

కుమార్తెలు
శేషారెడ్డి లక్ష్మీకాంతమ్మ
నల్లారెడ్డి కమలమ్మ
శేషారెడ్డి సుబ్బరత్నమ్మ
మల్లిపట్టు సంపూర్ణమ్మ

భార్య – ఈపూరు రాజమ్మ

# వయోజనులకు ఉత్తమావకాశం – దూరపు విద్యా విధానం!

**జి. హనుమంతరావు**
**రీసర్చ్ స్కాలర్, తిరుపతి**

స్కూళ్లు, కాలేజిలకు వెళ్లే వీలు, వసతి లేకున్నా విద్యను అభ్యసించాలనే ఆకాంక్షను వదలుకోలేని వారి కోసం ప్రత్యామ్నాయ పద్ధతులలో చదువు నేర్పించే ప్రయత్నాలు ప్రాచీన కాలం నుంచి వున్నాయి. దీనిని దూరపు విద్యా విధానం (Distant Education System) అంటారు. సామాజికంగా వచ్చే మార్పులు, శాస్త్ర, సాంకేతిక రంగాల అభివృద్ధికి అనుగుణంగా ఎప్పటికప్పుడు ఈ విద్యా బోధనలోనూ మార్పులు వస్తున్నాయి. దీనిని ప్రధానంగా మూడు విధానాలుగా వర్గీకరించ వచ్చు.

వాటిలో మొదటిది – ఉత్తర ప్రత్యుత్తరాల విద్య (కరస్పాండెన్స్ కోర్స్). దూరపు విద్యా విధానంలో ఇది అత్యంత ప్రాచీనమైనది. విశ్వ విద్యాలయ స్థాయిలో అధికారికంగా దీనిని క్రమబద్ధీకరించిన ఘనత ఢిల్లీ విశ్వవిద్యాలయానిది. వారు తమ విశ్వవిద్యాలయం బోధించే పలు కోర్సులను కరస్పాండెన్స్ పద్ధతిలో దేశ వ్యాప్తంగా వున్న విద్యార్థులందరికీ బోధించి, డిగ్రీలు ఇచ్చే విధానాన్ని తొలుతగా ప్రవేశ పెట్టారు. ఆ తర్వాత తమిళనాడులోని మధురై విశ్వవిద్యాలయం దీనిని అనుసరించింది. ఆ తర్వాత దేశ వ్యాప్తంగా పలు యూనివర్శిటీలు కరస్పాండెన్స్ కోర్సు విభాగాలు ప్రారంభించాయి. ఆంధ్రప్రదేశ్‌లో కేవలం కరస్పాండెన్స్ కోర్సు కోసం ఇందిరా గాంధీ ఓపన్ యూనివర్శిటీ నడుస్తున్నది. దేశ వ్యాప్తంగా కొన్ని లక్షల మంది దూర విద్యా విధానంలో చదువు నేర్చుకొంటున్నారు. సాధారణ విద్య నుంచి పోస్టు గ్రాడ్యుయేట్ కోర్సు వరకు, టిజడి వంటి వృత్తి విద్యలు సైతం ఈ పద్ధతిలో బోధింప బడుతున్నాయి. ఏ మాత్రం ప్రాథమిక విద్య లేని వారు కూడా డిగ్రీలు పొంద గల్గుతున్నారు. వివిధ సామాజిక కారణాల వల్ల చదువు అర్ధాంతరంగా మానివేసిన వేలాది మంది మహిళలు వివాహం తర్వాత కూడాను విద్యను కొనసాగించ గల్గుతున్నారు.

## రేడియో బోధన

దూర విద్యావిధానంలో కరస్పాండెన్స్ కోర్సుల తర్వాత పేర్కొన దగినది – ఆకాశవాణి ద్వారా బోధన. కెనడా ప్రభుత్వం మొదట ఈ పద్ధతిని ప్రవేశ పెట్టింది. మన దేశంలో రెండు విధాలుగా ఆకాశవాణిని విద్యా బోధనకు వినియోగిస్తున్నారు. మొదటిది – స్కూళ్లలో రేడియోలు పెట్టి, వివిధ పాఠ్యాంశాలను నిర్ణీత సమయంలో ప్రసారం చేయడం, రెండవది – రైతులు, కార్మికులు, విద్యార్థులు, వృత్తి పరమైన కార్యాలలో వుండే ఇతరుల కోసం ప్రత్యేక కార్యక్రమాలు రూపొందించి ప్రసారం చేయడం. ఐక్యరాజ్య సమితి విభాగమైన యునెస్కో ఇటు వంటి ప్రసారాలకు తన సహకారం అందజేస్తున్నది. రైతులకు నూతన వ్యవసాయ పద్ధతులు, విత్తనాల రకాలు, సేద్యంలో మెళుకువలు, మార్కెట్ వ్యవహార సరళి వంటి వాటి పై నిపుణుల చేత సలహా లిప్పిస్తున్నారు. విద్యార్థులకు గణిత, రసాయనిక, భౌతిక, జీవశాస్త్రాలు, ఆంగ్ల

కొరవ 8 పేజీలో



చదలవాడ కృష్ణమూర్తి కుమార్తె సుమలత, శ్రీనివాస నాయుడు వివాహ మహోత్సవంలో – ముఖ్యమంత్రి కోట్ల విజయభాస్కర రెడ్డి, పెండ్లి కుమారుడి తల్లిదండ్రులు, కృష్ణమూర్తి, సినీ నటులు చిరంజీవి, కృష్ణ తదితరులు. వీరి వివాహం 13 తేది తిరుపతిలో వైభవంగా జరిగింది.

జిల్లావార్తలు

# కాపులు చేసిన తప్పుకు ఊరంతటి కడుపు మాడ్చాలా?

కంచె చేను మేసిన చందానున్నట్లుంది ఇస్కపల్లి సారా సంగతి వింటుంటే; తీర ప్రాంతాల లోని మత్స్యకారులు విపరీతంగా సారా సేవిస్తారన్నది జగద్విదిత. సారా వ్యతిరేకవుద్యమ ఫలితంగా ఆ పాళెంలలో కూడా ఇటీవల మార్పు కనబడుతున్నది. అటువంటి మార్పు తమ పాళెంలో కన్పడకూడదని పట్టుబట్టారు ఏమోగాని ఇస్కపల్లి సర్పంచ్ పాళెం ప్రక్కనే తన అనుచరులచేత ఒకబ్రాంది షాపు పెట్టించేశారట. సారాకు మొహం వాచిన కాపులు ఆ షాపు ముందే తిష్టవేశారు. పాళెంలో ఒక వర్గం లాభ పడడం చూసి మరో వర్గం ఓర్వలేక పొయ్యింది. కప్పరాళ్ల తిప్పలో జోరుగా హాహారుగా నాటు సారా తయారు చేసున్న వారితో ప్రత్యేక ఒప్పందం కుర్చు... రోజుకు నాలుగు బస్తాల ...రా తెప్పించి అమ్మడం మొదలు పెట్టారటవారు. ఈ విషయం ఆనోట, ఆనోట చేరి చివరికి రెవిన్యూ వారి చెవికి సోకింది. ఎమ్మార్వో గారు విషయం పరిశీలించి పాళెం వాళ్లను దారిను దారికి తేవాలన్న నెపంతో మొత్తం ఇస్కపల్లి గ్రామానికే రేషన్ కట్ చేసిపారేశాడట. దీనివల్ల పాళెంతో సంబంధం లేని వూరిలోని బీదాబిక్కి నానా యాతనలు పడుతున్నారు. పది మందికి చెప్పవలసిన వారే తప్పు చేసినపుడు అధికార్లు ఎలాగోలా ఆతడ్ని మందలించి షాపు తీసి వేయించేందుకు ప్రయత్నించి వుంటే బాగుండేది. కాపుల మార్పుకోసం మొత్తం వూరి ప్రజల కడుపు మాడ్చడం ఏమి బాగుంటుందో అధికార్లు ఆలోచించాలి.

## రాపూరులో పిచ్చి కుక్కల బెడద

రాపూరులో ఇటీవల పిచ్చి కుక్కల బెడద ఎక్కువై పోయింది. గత వారం రోజులుగా ఈ కుక్కలు దారివెళ్లే 40 మందిని కసి తీరా కరచి పారేసాయి. ప్రభుత్వ ఆసుపత్రిలో కుక్క కాటుకు వాక్సిన్ లేక పోవడంతో బీద బిక్కి జనం పాట్లు వర్ణనాతీతం. ప్రైవేట్ ఆసుపత్రులలో చికిత్స చేయించుకోను స్థోమతలేని వారు ఆకుల, అలముల చికిత్సతో సరిబెట్టు కొంటున్నారు. కుక్కలను పట్టించాల్సిన బాధ్యత పంచాయితీది. వారు విఫలమయ్యారు. కరచి కక్ష తీర్చుకొంటున్న వీటిని లామైనా పూనుకొని చంపలేని ప్రజలను చూస్తుంటె జాలి వేస్తుంది

## రాజీవ్ లేని లోటు ఎవరూ పూడ్చలేరు

మాజీ ప్రధాని స్వర్గీయ రాజీవ్ గాంధీ జయంతిని 20 తేది కావలిలో టౌన్ కాంగ్రెస్ కమిటి, యునైటెడ్ కమ్యూనిస్ట్ పార్టి కమిటీ సంయుక్తంగా ఘనంగా జరిపాయి. ఈ సందర్భంగా ఏర్పాటైన సభలో జవహర్ భారతి కళాశాల ప్రిన్సిపల్ రత్న జోసఫ్ ప్రసంగిస్తూ- శ్రీ రాజీవ్ గాంధీ లేని లోటు ఎవరూ పూడ్చలేరన్నారు. దేశ సమైక్యత, సమగ్రతలకు ప్రాణాన్ని ధారబోసిన మహనీయుడాయన; ఆయన బలిదానం విలువ ప్రస్తుతానికి అర్థం కాకపోయినా కొన్ని సంవత్సరాల తరువాత ఆ విలువ తెలుస్తుంది. దేశాన్ని ప్రగతి పథాన తీసుకు పోయేందుకు ఆయన చేసిన కృషి మరవరానిదన్నారు. మాజీ మున్సిపల్ ఛైర్మన్ గ్రంధి యానాది శెట్టి అధ్యక్షత వహించిన ఈ సభలో ఆర్. సుందర రావు, తిరుపాల్, వి.వి. నరసింహా చార్యులు తదితరులు పాల్గొన్నారు. మాజీ కౌన్సిలర్ బాల్వి చివరన వందన సమర్పణ చేశారు.

## రోడ్డు వేసేందుకు ముహూర్తం కుదరలేదు

ప్రభుత్వం బిట్లు, బిట్లుగా ఆర్ అండ్‌బి రోడ్ల నిర్మాణానికి కాంట్రాక్ట్ ఇచ్చే ప్రక్రియ వల్ల పని పూర్తవ్వడం అంటుంచితే, కాంట్రాక్టర్ల మధ్యసమన్వయం లోపించి ఎక్కడి పనులు అక్కడ నిలిచి పోవడం

# కొరతల నిలయం కావలి ఆసుపత్రి

మునిసిపల్ పరిధితో పాటు డివిజన్ లోని పలు గ్రామాల నుండి వచ్చే రోగులకు వైద్యం చేయ వలసిన కావలి ప్రభుత్వాసుపత్రిలో పలు సౌకర్యాలు లోపించి వున్నాయి. శుభ్రత, మందుల కొరత సంగతి చెప్పనవసరంలేదు. ఆసుపత్రి ఆవరణలో వున్న బావిలో నీరు ఎండిపోవడంతో రోగులు పడే పాట్లు చెప్పనలవి కాదు. ఇక్కడికి వచ్చే వారి రోగ నిర్ధారణకు కనీస పాటి అవసరమైన ఎక్స్ రే ప్లాంట్ చెడిపోయి నెలలు గడుస్తున్నా పట్టించు కొనే నాధుడు లేడు. దీనివల్ల ప్రైవేట్ ఎక్స్‌రే హోమ్‌లను ఆశ్రయించాల్సి వస్తుంది. ఇటీవల ఆసుపత్రికి కొత్త డాక్టర్ వచ్చారు. ఆయన సౌకర్యాల కొరత పై శ్రద్ధ వుంచి, వాటిని రూపు మాప గలిగితే ప్రజలకు మేలు చేసిన వారవుతారు.

## జీతాలు లేని మునిసిపల్ వుద్యోగులు

కావలి మునిసిపల్ వుద్యోగులు కూడా నెలల తరబడి జీతాలు లేక అల్లాడి పోతున్నారు. మునిసిపాలిటీ పరిధిలో పన్నులు వసూలు చేసి వాటినే జీతాల గ్రాంటుగా వుపయోగించు కోమన్న ప్రభుత్వ వుత్తర్వుల వల్ల ఈ స్థితి దాపురించింది. ఆదాయం అంతంత మాత్రమే అయిన కావలి మునిసిపాలిటీలో వసూలయ్యే మొత్తం ప్రజా సంక్షేమం కార్యక్రమాలతో పాటు సిబ్బంది జీతాలకు చాలదు. ప్రభుత్వ జి.వో. విషయమై 91 డిసెంబరులో మునిసిపల్ వుద్యోగులు ఆందోళన చేస్తే ప్రభుత్వం నిబంధనను సడలిస్తా మన్నది గాని తరువాత పట్టించు కోవడమే మాని వేసిందట. అందువల్లే మునిసిపల్ వుద్యోగులు తిరిగి సెప్టెంబర్ 16 తేది నుండి సమ్మెకు ఉద్యుక్తుల వుతున్నారు. దానిలో భాగంగా 25 తేది నుంచి నల్లబాడ్జీలు ధరించి విధులకు హాజరై విరసన తెలుపుతున్నారు. మునిసిపాలిటీలో అన్ని తరగతుల వుద్యోగుల సంఘాలూ సమ్మెకు పిలుపు నివ్వడం వల్ల ప్రజారోగ్య పరిస్థితులు క్షీణించవచ్చు. ప్రభుత్వం ఏదో ఒక నిర్ణయం తీసుకోక పోతే పరిస్థితులు ఎలా వుంటాయో చెప్పడం కష్టం.

# నెల్లూరు ముచ్చట్లు

## విదూషకుడు

### ప్రధాని నెల్లూరు రాక

భారత ప్రధాని శ్రీ పి.వి. నరసింహారావు సెప్టెంబరు 1 తేది శ్రీహరికోట వస్తున్నారు. ఉదయం ప్రత్యేక విమానంలో మద్రాసుకు, అక్కడి నుంచి హెలికాప్టర్‌లో శ్రీహరికోటకు, తిరిగి మద్రాసు అట్నుంచి అటే ఢిల్లీ. షార్ కేంద్రం సందర్శనే కార్యక్రమం. సెప్టెంబరు 6 నుంచి 8 తేది మధ్య కొత్తగా రూపొందించిన పిఎస్ఎల్‌వి రాకెట్‌ను శ్రీ హరి కోట నుంచి ప్రయోగించనున్న నేపథ్యంలో ప్రధాని పర్యటన చాలా ప్రాధాన్యత సంతరించుకొంటున్నది.

ప్రధానిగా ప్రమాణ స్వీకారం చేసిన తరువాత శ్రీ పి.వి. నెల్లూరు జిల్లాకు రావడం ఇదే ప్రథమం. ఆయనకు భారీ స్థాయి బందోబస్తు ఏర్పాట్లు జరుగుతున్నాయి. వందలాది మంది పోలీసులతో శ్రీహరికోటను, సమీపంలోని తీరగ్రామాలను యుద్ధ శిబిరాల వలె తయారు చేస్తున్నారు.

### జనార్ధనరెడ్డి

వారం రోజుల పర్యటన అనంతరం మాజీ ముఖ్యమంత్రి శ్రీ ఎన్. జనార్ధన రెడ్డి 24 తేది హైదరాబాదు వెళ్లిపోయారు. ప్రధానికి స్వాగతం చెప్పడం కోసం తిరిగి 31 తేది నెల్లూరు లేదా తిరుపతి వచ్చే అవకాశం వుంది.

### పెంచలయ్య

సమాచార మంత్రి శ్రీ పసల పెంచలయ్య 24 తేది నెల్లూరు వచ్చారు. 29 తేది తిరుగు రైలెక్కుతారు.

### వెంకయ్య నాయుడు

అఖిల భారత బిజెపి ప్రధాన కార్యదర్శి శ్రీ ఎం. వెంకయ్య నాయుడు నెల్లూరు పర్యటనలో వున్నారు.

### జర్నలిస్టుల కోపం

శ్రీహరికోట కేంద్రానికి విఐపిలు వచ్చినా, రాకెట్లు ఎగర వేసినా నెల్లూరు పాత్రికేయులకు 'నో' ఎంట్రీ బోర్డు చూపించడం అన్యాయమని నె.జి. జర్నలిస్టుల సంఘం ఆక్రోశిస్తున్నది. షార్ కేంద్రం అధికారులకు నెల్లూరు విలేఖరులంటే గడ్డిపోచతో సమానం. లెక్క చేయరు. ఏమి జరిగినా మద్రాసు పాత్రికేయులను రాచమర్యాదలతో తెచ్చి, వార్తలిచ్చి, సాగనంపుతారు. రేపు ప్రధాని మంత్రి కార్యక్రమం గతి అంతే! మాకూ రాకెట్లు చూచే యోగం కల్పించమని జర్నలిస్టుల సంఘం అధ్యక్షుడు శ్రీ బి. వెంకట సుబ్బయ్య పివికి ఒక వినతి పత్రం పంపారు; వింటారా, ఆయన?

### ఎన్ఆర్‌కు సన్మానం

కేంద్ర ప్రభుత్వంలో జాయింట్ సెక్రటరీగా రిటైరై విశ్రాంతి జీవితం గడుపుతున్న నెల్లూరీయుడు శ్రీ ఎన్.ఆర్.కు (నల్లపరెడ్డి రామరాఘవ రెడ్డి) మద్రాసులోని తెలుగు మహాజన సమాజం ఘన సన్మానం చేసింది. మద్రాసులో స్థిరపడిన నెల్లూరు పారిశ్రామికుడు శ్రీ ఏనుగ సీతారామ రెడ్డి, భూరి విరాళమిచ్చి శృంగేరి మఠ పీఠం రోడ్డులోని శ్రీ వేణుగోపాల విద్యాలయంలో ఎన్ఆర్ పేర ఒక కొత్త భవనం కట్టించారు. తమిళనాడు గవర్నర్ డాక్టర్ మర్రిచెన్నారెడ్డి దానికి ప్రారంభోత్సవం చేసే సమయంలోనే ఈ సన్మానమూ జరిగింది. సభను అపోలో ఆస్పత్రి ఛైర్మన్ డాక్టర్ పిసి రెడ్డి; శంకర నేత్రాలయ అధిపతి శ్రీ వి. మోహనరావు, పారిశ్రామిక వేత్త శ్రీ ఆర్.వి. రమణి తదితరులు మాట్లాడారు.

శ్రీ ఎన్ఆర్ – మొలగనూరు వాసి. బనారస్ హిందూ విశ్వవిద్యాలయంలో ఇంజనీరింగ్ చదివేటప్పుడు లండన్‌లోని విక్టోరియా విశ్వ విద్యాలయం ఆయన ప్రతిభను గుర్తించి స్కాలర్ షిప్ ఇచ్చి రప్పించుకున్నది. ఆయన అక్కడే ఎంఎస్‌సి చేశారు. బ్రిటిష్ నేవీలో ఉన్నతాధికారిగా చేరారు. ఈలోగా రెండవ ప్రపంచ యుద్ధం మొదలు కావడంతో ఆయన తండ్రి ఇండియాకు వచ్చేయమన్నాడట. నేవీ అధికారులు వప్పుకోలేదు. రహస్యంగా ఒక యుద్ధ పడవ ఎక్కి అమెరికా, పనామా, సింగపూర్‌ల మీదుగా వంద రోజులు ప్రయాణించి ఇండియా చేరాడు. బయల్దేరేటప్పుడు 17 యుద్ధ పడవలు వుండినాయట; జపాన్ నావికాదళం వాటిలో 15 పడవలను అమెరికా తీరంలో ముంచి వేసింది. ఎన్ఆర్ అదృష్టం బాగుండి బ్రతికి బయట పడ్డాడు. ఆ తర్వాత భారత ప్రభుత్వ సర్వీసులో చేరి పలు హోదాలు నిర్వహించాడు. మాజీ కేంద్ర మంత్రి స్వర్గీయ టి.టి. కృష్ణమాచారి ఒకసారి కలకత్తాలో ఎన్ఆర్‌ను కలిసి, ప్రతిభ గుర్తించి, తన ప్రైవేటు కార్యదర్శిగా నియమించుకున్నారు. ఎందరో పారిశ్రామిక వేత్తలు ఆయన సహకారంతో విదేశీ సాంకేతిక పరిజ్ఞానం పొంది, అభివృద్ధి చెందారు. చివర్న 1976 లో కేంద్ర ఆర్థిక శాఖ జాయింట్ సెక్రటరీగా శ్రీ ఎన్.ఆర్. రిటైరయ్యారు.

### స్టేడియంకు కొత్త కోచ్

నెల్లూరు ఎసి స్టేడియం ప్రధాన కోచ్ శ్రీ డి.రవి విజయవాడ హాకీ కోచ్‌గా బదలీ అయ్యారు; అనంతపురం నుంచి శ్రీ జగన్నాథ రెడ్డిని ఇక్కడ నియమించారు.

కొత్త కోచ్ అయినా స్టేడియంకు పునరు జ్జీవం కల్పిస్తారా?

### హుసేన్ సాగర్ బస్‌లో నెల్లూరీయుడు

21 తేది రాత్రి హైదరాబాదు సిటీలో ట్యాంక్ బండ్ పై నుంచి హుసేన్ సాగర్‌లోకి జారిపడిన ఆర్‌టిసి బస్ ప్రమాదంలో ఒక నెల్లూరీయుడు మరణించాడు ప్రస్తుతం రంగారెడ్డి జిల్లా మలేరియా సబ్ యూనిట్ ఆఫీసరుగా పనిచేస్తున్న ఎస్. హరనాథ రావు (52) యూనియన్ సభల కోసం ఆదిలాబాద్ వెళ్లాలని బయల్దేరి సజల సమాధి చెందాడు. పాపం! ఆయన భార్య గూడూరు వాస్తవ్యురాలు; డైరీ డెవలప్‌మెంట్ కార్పొరేషన్ ఉద్యోగిని. వారికి ఇద్దరు పిల్లలున్నారు.

హరినాథ రావు ఐఎన్‌టియుసి రాష్ట్ర అసిస్టెంట్ జనరల్ సెక్రటరి;



వర్కర్స్ వాయిస్ పత్రికా సంపాదకుడు; ఆం.ప్ర. ప్రజారోగ్య వైద్య వుద్యోగుల సంఘం ప్రధాన కార్యదర్శి. రాష్ట్రంలోని పలు కార్మిక ఉద్యమాలతో సంబంధం వుంది.

వారి కుటుంబానికి మా సానుభూతి.

### మరణం

ముత్తుకూరు మండలం నేలటూరు మాజీ గ్రామ మునసబు, బ్రిటీషు హయాంలో పలు ప్రశంసా పత్రాలు పొందిన శ్రీ ఈపూరు నారాయణ రెడ్డి (89) 22 తేది మరణించారు. గుడ్లూరువారి పాళెం అభ్యుదయ రైతు ఈపూరు వెంకురెడ్డి ఆయన దత్త కుమారుడు. వారి కుటుంబానికి మా సానుభూతి.

### నెల్లూరు సబ్ కోర్టులో

E.P. No. 51 of 92

O.S. No. 258 of 1983

కారంశెట్టి వీర రాఘవయ్య -DHr/వాది

Vs

(1) కావుగుంట రామచంద్రయ్య

(2) బచ్చు వెంకట సుబ్రహ్మణ్యం

- J.Dr.s ప్రతివాదు

యీ నంబరు డిక్రీ బాకీకి గాను యీ క్రింది షెడ్యూలు దాఖలా ప్త్రరాస్తిని కోర్టు వారి పేలన 31.8.1993 తేది బహిరంగముగా వేలం వేయబడును.

షెడ్యూలు

Nellore Registration District - Nellore Sub registration District - Nellore Town - Stonehousepet, Vijaya Gopalapuram Municipal Ward No. 4, Door No. 99/E, Assessment No. 2923 Sreenivasa Oil Mill (Now Sree Rama Oil Mill) and vacant site etc., within the following boundaries.

East: Compound wall of this house by the side of the vacant site of Kamisetty Subbarayudu, South: Panta Kalava; West: Road; North: Private road of Kamisetty Subbarayudu.

Within the boundaries about 187 ankanams 1250 - 856 Sq. meters of site. In which are constructed sheds and godowns etc., of about 85 ankanams 568 - 565 sq. meters of oil mill therein with its machinery, transformer, current appliances, meter expellers, two filters, refrigerators and its machinery, doors, door ways, roof, roofing materials, site underneath, compound wall on all sides, electric fittings and meter H.S.C. No. 13163 with security deposit and with all easement rights.

D.H.R. value Rs. 2,00,000/-

Amin's Value Rs. 5,00,000/-

J.D.R.'s Value Rs. 16,24,000/-

టి. శ్రీహరి,

DHr అడ్వకేటు

## కడప

(2 పేజీ తరువా)

నమ్మకమైన యువకులను ఎంపిక చేసి సరఫరా చేస్తారు.

డాక్టర్ వై.ఎస్. రాజశేఖర రెడ్డి తండ్రి వైఎస్. రాజారెడ్డి (పులివెందుల) కాటమయ్య (పెదముడియం) - డాక్టర్ ఎం.వి. రమణారెడ్డి, ఎమ్మెల్యే వరద రాజులు రెడ్డి .(ప్రొద్దుటూరు), ఎస్. పాలకొండరాయుడు ( రాజంపేట), టి. చెంగల్ రాయుడు (కోడూరు), బ్రహ్మానంద రెడ్డి (పుల్లంపేట) నరసింహా రెడ్డి (చిట్వేలు) మొన్న మరణించిన శివారెడ్డి (జమ్మలమడుగు) కడప జిల్లాలో ఇప్పుడు పేరున్న ముఠా నాయకులు. వీరు కాక ప్రతి మండలంలోనూ ఇంకా ఎందరో ముఠా పెత్తందార్లు వున్నారు. మహిళలూ నాయకత్వం స్వీకరించడం ఇక్కడ ఆనవాయితీ. మైలవరం మండలంలో శ్రీమతి పుష్పమ్మ పేరున్న నాయకురాలు. ఆమెను చంపడానికి శివారెడ్డి ఎన్నిసార్లో విఫల ప్రయత్నం చేశాడు కూడా! కొండాపురంలో శ్రీ కొండా బలరామరెడ్డి, మైలవరంలో శ్రీ మైఖేల్ విజయకుమార్, జమ్మలమడుగులో శ్రీ రామనాథ రెడ్డి, డిసిసి బ్యాంకు అధ్యక్షుడు శ్రీ నారాయణ రెడ్డి వంటి వారు ప్రాబల్యం కల్గిన ముఠా నాయకులుగా పరిగణనౌతారు.

ఈ ముఠా నాయకుల మధ్య వైరం, స్నేహం రెండూ వుంటాయి. వైఎస్ రాజారెడ్డికి, చెంగల్రాయుడికి సరిపడదు. సందు చిక్కితే చంపుకోవడానికి రెడీ. తిరుపతిలో కూడా వీరు యుద్ధాలు చేసుకొన్న సంఘటనలున్నాయి. శివారెడ్డికి మైఖేల్ విజయ కుమార్, పుష్పమ్మలకు పొత్తు కుదిరేది కాదు. భీషణ సంగ్రామాలే జరిగాయి. విజయకుమార్ అనుచరులు ఎందరో చచ్చారు కూడా! కాని, శివారెడ్డి ధాటికి తట్టుకోలేక ఒక దశలో వీరిద్దరూ ఆయనతో రాజీ పడిపోయారు. దాని ఫలితంగా శివారెడ్డికి మైలవరం మండలంలో తిరుగులేని ఆధిపత్యం సంక్రమించింది. అయితే వీరిద్దరిని నమ్ముకొని శివారెడ్డితో యుద్ధం చేసిన గ్రామ స్థాయి నాయకులు అన్యాయమై పోయారు.

గ్రామ నాయకుల కక్షలకు కత్తులు, గొడ్డళ్లు ఆయుధాలైతే, ముఠా నాయకుల వైరానికి బాంబులు, తుపాకులు సాధనాలు. ఇది వరకు ఏ యుద్ధమైనా కడప సరిహద్దులలోనే జరిగేది. ఇప్పుడు ఎల్లలు చెరిగి పోయాయి. హైదరాబాదులో శివారెడ్డి పై జరిగిన దారుణ దాడి దీనికి నిదర్శనం.

గ్రామ స్థాయిలో కక్షలు, కార్పణ్యాల మాలిన్యం మగవారితోపాటు ఆడవారినీ అంటు కుంటుంది. తమ భర్తను మట్టు పెట్టిన వారు మట్టిలో కలిసే వరకు తాళి తెంపనని ప్రతిజ్ఞలు చేసే వీరనారీ మణులు ఎందరో వున్నారు. వివాహమై ఇంటికి వచ్చిన కొత్త కోడళ్లకు బాంబులు, తుపాకులు ప్రయోగించడంలో శిక్షణ నిస్తారు. గ్రామంలో జరిగే యుద్ధంలో వారు తమ భర్తలతో సమానంగా పాల్గొంటారు. భర్త చనిపోతే ఆమే ముఠా నాయకత్వం స్వీకరిస్తారు. కుటుంబ సభ్యులు ఆమెకు అండగా వుంటారు. తమ అనుచరులను ప్రేరేపించి, హత్యలకు పురికొల్పే మహిళలు ఎందరో వున్నారు.

చాలా గ్రామాలలో హత్యలు జరిగితే కేసులు నమోదు కావు. కేసుపెట్టి, శిక్ష పడితే తమ ప్రత్యర్థుల పై ప్రతీకారం తీర్చుకొని చంపే అవకాశం వుండదని వారసలు కేసే పెట్టరు. అందువల్ల అవి పోలీసు రికార్డులకు ఎక్కవు. పోలీసులు తమంతటు తాము తెలుసుకొని వస్తే సాక్ష్యం చెప్పడానికి ఎవరూ ముందుకు రారు. ఎన్నో హత్యలు, దౌర్జన్యాలు, ఆస్తి విధ్వంసాలు లోకానికి తెలియకుండానే సమసి పోతుంటాయి. బహిరంగంగా చంపే సంఘటనలు కొన్నయితే, కుట్ర పన్ని దొంగ దెబ్బ తీసి, చంపి, శవాన్ని ఏ నదిలోనో పారేసివి కొన్ని. నీళ్లులేనికుండు నది ఇసుక తిన్నెల పై ఎన్ని లీటర్ల మానవ రక్తం ఇంకిపోయి వుంటుందో వూహించలేము.

పోలీసులు పరమ దండగ. చచ్చిన తర్వాత శవ పంచాయితీలు చేయడానికి రావడం తప్ప హత్యలు నివారించడంలో వారెప్పుడూ సఫలీకృతులు కారు. పెక్కు పోలీసు స్టేషన్లు ముఠా నాయకుల పోషణలో వుంటాయి. నెల నెలా వారికి జీతం కంటె దండిగా మామూళ్లు అందుతుంటాయి. ఇన్స్‌పెక్టర్లు, సబిన్స్‌పెక్టర్లు, కానిస్టేబిళ్లు భయభక్తులతో ముఠా నాయకుల ఆదేశాలు పాటిస్తుంటారు. వారి హత్యా పన్నాగాలు తమకు తెలిసినా "పని పూర్తయినంత వరకు" తెలియనట్లే వుంటారు.

పోలీసుల అసమర్థత, అవినీతి వల్లనే కడపలో ముఠా కలహాలు, హత్యా రాజకీయాలు నిరాటంకంగా కొనసాగు తున్నాయన్నది వాస్తవం. కడపలో పనిచేసే అధికారులు లక్షలార్జిస్తారని వినికిడి.

కడప ముఠా నాయకుల గురించి, మరీ ముఖ్యంగా రాజారెడ్డి, ఎం.వి. రమణారెడ్డి, శివారెడ్డి వంటి వారి గత చరిత్రల గురించి ఆరా తీసి, చెప్పుకొంటూ పోతే ఒళ్లు జలదరించే కిరాతక సన్నివేశాలెన్నో కన్పిస్తాయి. ముఠా కలహాలతో సతమతమయ్యే గ్రామాలలో ఏ గడప ఎక్కి చూసినా కన్నీళ్లే కన్పిస్తాయి. నాయకులు మాత్రం ఎప్పుడూ క్షేమంగా వుంటారు; ప్రజలు అల్లాడి పోతుంటారు.

ఈ ముఠా కలహాల వల్ల కడప జిల్లాలో ఎన్నికలు పెద్ద ప్రహసనం క్రింద మారిపోయాయి. రిగ్గింగ్ తప్ప, స్వేచ్ఛగా ఓటర్లు పోలింగు బూతులకు వచ్చి ఓటు చేసే అవకాశమే వుండదు. ఎవరి కత్తికి ఎక్కువ పదునైతే వారిదే పెత్తనం. ఆ క్రూర, ఘోర, వికృత సాంఘిక వాతావరణంలో బ్రతుకు లీడుస్తున్న కడప వాసులను చూచి జాలి పడాల్సిందే తప్ప ఇప్పట్లో ఎవరు చేయగల్గిందే ఏమీ లేదు. మన ప్రభుత్వాలకు అంతటి చేవ లేదు. ముఖ్యమంత్రికి ముఠాల తీరు తెన్నులు, బలహీనతలు బాగా తెలుసు; ఆయన తలిస్తే వీటిని అదుపు చేయడం కష్టం కాదు; కాని లచే వాడిని ఎక్కడి నుంచి తేస్తాం?



## జిల్లా వార్తలు

(5 పేజీ తరువా)

రివాజయ్యింది. అధ్వాన్న స్థితిలో వున్న రాపూరు-పొదలకూరు రోడ్డు నిర్మాణానికి రెండేళ్ల క్రితమే నిధులు మంజూరయ్యాయి. కాంట్రాక్టర్‌కు రోడ్డు పని చేయను ముహూర్తం కుదరక ఇన్నాళ్లు కాలం గడిపి రెండు నెలల క్రితమే పని ప్రారంభించి సగం రోడ్డు పూర్తి చేసి వదిలేశాడు. వేపినాపి నుండి డ్యామ్ వరకు పోయే ఆరు కిలో మీటర్ల రోడ్డు సంగతి ఏమిటయ్యా అంటే తన వాటాలో అది లేదన్నాడు. సగం పూర్తయినా మిగతా సగం గుంటలు మిట్టలతో నిండిన రోడ్డులో బస్సు ప్రయాణం చేసేవారికి నరకం ఎలా వుంటుందన్న విషయం తక్షణం స్ఫురణకు వచ్చేస్తున్నది. కార్లు, స్కూటర్ల వాలాలైతే పాపం ఈ మార్గాన ప్రయాణమే మానేశారు. కొత్తగా వేసిన రోడ్డు నామ రూపాలు లేకుండా పోయిన తరువాత గాని మిగతా రోడ్డు వేసేందుకు ముహూర్తం ఆ కాంట్రాక్టరుకు కుదిరేటట్టులేదు. పట్టించుకొనే అధికారి వున్నారా?

## జనవాణి

(3 పేజీ తరువా)

పట్టనట్లు వున్నారా! ఇంతకూ ధరలు కంట్రోలు చేస్తామన్న ప్రధాని, ఆర్థిక మంత్రి, మాటలు చద్దెన్నపు మూటలేనా!

నెల్లూరు —చీదెళ్ల

### ఎంప్లాయిమెంట్ అధికారి దురుసుతనం

మేము ప్రైవేట్‌గా విద్యనభ్యసించిన విద్యార్థులం. ఎనిమిదవ తరగతి ప్రైవేట్‌గా పాసై, అదే విధంగా పదవ తరగతి కూడా పాసయ్యాము. గత వారంలో ఎంప్లాయిమెంట్ ఆఫీసులో ఈ విషయాన్ని నమోదు చేసుకొనేందుకు పోతే, ట్రాన్స్‌ఫర్ సర్టిఫికెట్ తెస్తే గాని రిజిస్ట్రేషన్ చేసుకోనని చెప్పి, మార్కుల లిస్టు విసిరి పారవేసారు ఎంప్లాయిమెంట్ అధికారి. మా సర్టిఫికెట్లలో ప్రవేట్ విద్యార్థులని రాసి వున్న విషయం స్పష్ట పరుచుదామన్నా వినిపించుకో లేదు. బయటకు విసిరి వేయడంలో మార్కుల లిస్ట్ కూడా చిరిగి పోయింది. జిల్లా అధికారి మరీ ఇంత ఓపిక లేకుండా దురుసుగా ప్రవర్తించడం ఏ మాత్రం బాగోలేదు. కలెక్టర్ గారూ కనీసం మీరైనా న్యాయం చేయండి.

నెల్లూరు —జి. మాధవ, ఎం. ప్రసాద్

## ముఠా నాయకుడు

(మొదటి పేజీ తరువా)

రామకృష్ణారెడ్డి, శ్రీ బైరెడ్డి రాజశేఖర రెడ్డి తదితరులందరూ చెప్పుకోదగిన ముఠాలకు నాయకత్వం వహిస్తున్నారు. వారి వారి ప్రాంతాలలో వారికి ఎదురులేదు. ఎన్నికలు, గిన్నికలు అన్నీ వారి ఆజ్ఞల మేరకే జరుగుతాయి.

అనంతపురంలోనూ ముఠాల ప్రాబల్యం హెచ్చుతున్నది. రోడ్లు భవనాల శాఖా మంత్రి శ్రీ జె.సి. దివాకర రెడ్డి, ఆయన సోదరుడు శ్రీ జె.సి. ప్రభాకర రెడ్డి ఇప్పుడు జిల్లాలో అతి పెద్ద ముఠాకు పెత్తందార్లు. వారికి స్థానికంగా అనుచర వర్గంతో పాటు, అధికారమూ అందుబాటులో వుండడం, పోలీసులు మద్దతుగా నిలవడంతో వారిని ప్రతిఘటించడం ప్రత్యర్థులకు అలివి కావడం లేదు. అందువల్ల వారు కడప నుంచి శ్రీ వై.ఎస్. రాజశేఖర రెడ్డి సహకారం తీసుకొంటున్నారు.

## పంచాంగము

### ఆగస్టు తిథులు

అధిక భాద్రపద శుద్ధ

| | |
|---|---|
| తే 28 శని ద్వాదశి రా.గ. | 4.00 వ |
| తే 29 ఆది త్రయోదశి రా.గ. | 4.15 వ |
| తే 30 సోమ చతుర్దశి పూర్తిగ | |

### అధిక భాద్రపదబహుళ

సెప్టెంబరు నెల:

| | |
|---|---|
| తే 31 బుధ పూర్ణిమ ఉ.గ. | 6.40 వ |
| తే 1 గురు పాడ్యమి ఉ.గ. | 8.20 వ |
| తే 2 శుక్ర విదియ ఉ.గ. | 10.15 వ |

స్వయంపాకుల శ్రీనివాసులు.



## ప్రకటన

నెల్లూరు టౌన్, డోర్ నెం. 16/2961, జవహర్‌లాల్ రోడ్ కాపురస్తుడైన జె. మోహన్‌రాయ్ అను నేను యావన్మందికీ తెలియ జేయడమేమనగా.

18-6-93 తేది ఈనాడు పత్రికలో, శ్రీమతి ఎన్. రాజకుమారి పద్మిని దేవి అనువారు నా సోదరిగా తెలుపుచూ, నెల్లూరు తాలూకా, పడారుపల్లి గ్రామం, సర్వేనెం. 82, 83 లో 5 ఎకరాల భూమి విషయమై ఒక ప్రకటన చేసినారు. ఈ ఆస్తి విషయమై మా ఇద్దరి మధ్య . వ్యాజ్యము జరుగుచున్నది. నేను ASSR నెం. 2507/93 లో ఆంధ్రప్రదేశ్ హైకోర్టులో కూడా అపీలు చేసివున్నాను. పై పెద్యూలు ఆస్తిని సదరు రాజకుమారి పద్మిని దేవిగాని, ఇతరులు ఎవ్వరుగాని అమ్ముట, ఆదుమానుము పెట్టుట లేక ఇతర విధములైన అన్యాక్రాంతములు చేయుట చెల్లనేరవు. వారికి ఆ అధికారము లేదు. అట్లు చేసినచో నన్నుగ్గాని, సదరు ఆస్తిని గాని బద్ధగించవు. అందుమీద నేను తీసుకొను సివిల్, క్రిమినల్ చర్యలకు బాధ్యులగుదురు.

జె. మోహన్‌రాయ్

## గూడూరు డిస్ట్రిక్టు మునసబు వారి కోర్టులో

S.C. No. 50/92

స్టేట్ బ్యాంక్ ఆఫ్ ఇండియా.
పొదలకూరు -వాది

Vs

పొదర్తి బుజ్జమ్మ -ప్రతివాది
W/o. పెంచలయ్య
వేదురుపల్లి గ్రామం
పొదలకూరు (మండలం)
నెల్లూరు (జిల్లా)

వాది పై నంబరు దావా బాకీ రాబట్టు నిమిత్తం మీమీద దాఖలు చేసి యున్నందున మీరు 22.9.93 తేదిన ఉదయం 10 గంటలకు పై కోర్టులో హాజరై మీకు గల ఆక్షేపణలు తెల్పుకొని యెడల మీ పరోక్షమున దావా తీర్మానించ బడును.

వాయిదా సి. పరాంకుశరావు
22.9.93 వారి యొక్క న్యాయవాది

## గూడూరు సబార్డినేటు జడ్జి వారి కోర్టులో

S.C. No. 103/92

స్టేట్ బ్యాంక్ ఆఫ్ ఇండియా.
పొదలకూరు -వాది
కూనిపోగు పొందమ్మ -ప్రతివాది
నోటీసు

To
కూనిపోగు పొందమ్మ,
W/o. పెంచలయ్య @ కర్రెయ్య.
నేదురుపల్లి గ్రామం,
పొదలకూరు (మండలం)

వాది పై నంబరు దావా బాకీ రాబట్టు నిమిత్తం మీ మీద దాఖలు చేసి యున్నందున మీరు 9.9.93 తేదిన ఉదయం 10 గంటలకు పై కోర్టులో హాజరై మీకు గల ఆక్షేపణలు తెల్పుకొనిన యెడల మీ పరోక్షమున దావా తీర్మానించ బడును.

వాయిదా సి. పరాంకుశ రావు
9.9.93 వారి యొక్క న్యాయవాది

## నెల్లూరు సబార్డినేటు జడ్జివారి కోర్టులో

O.S. No. 239 of 1991

ఇండియన్ బ్యాంక్, నెల్లూరు
రెప్రెజెంటెట్‌బై ఇట్స్ మేనేజర్... వాది
Sk. మస్తాన్ ప్రతివాది

To
Sk. మస్తాన్
S/o.లేట్ బుడేసాహెబ్
22/1, అహలి రోడ్
ఎలక్ట్రిసిటీ ఆఫీసు దగ్గర, నెల్లూరు- 1.

పై నెంబర్ను వాది, బాకీ రాబట్టుకొను నిమిత్తము మీ మీద దావావేసి ఉన్నందున మీకు నోటీసు నిమిత్తము 7-10-1993 తేదికి వాయిదా వేసి ఉంది. ఆ రోజు పగలు గం.10-30ని.లకు. మీరు పై కోర్టులో హాజరై మీ ఆక్షేపణలు తెల్పుకోని యెడల మీ పరోక్షమందు కేసు తీర్మానిం చబడును.

కొండూరు శేషారెడ్డి
వారి తరఫు వకీలు

# శేషారెడ్డి పద్యాలు

### శ్రీ రాంమూర్తి

ఆది నుంచి గూడ ఆపేక్ష నీవంటె,
పెరగతుందిగాని తరగటంలె
పోయినవారు తిరిగి పుట్టేది ఇక లేదు
అన్ని తెలుసు నెపితె అర్ధంకాదు;

ఎందుకు బుట్టిస్తారో
యెందుగ్గా జంపుతారో, యెవ్వరెరుగు
మందల దేవ రహస్యమ్ము
గందర గోళమ్ము పెద్ద గారడి బురిడి!

కట్టుకున్న భార్య కడతేరి పొయ్యాక
కనుమూసి నాక కన్న తల్లి
యెక్కడుంటె కవిని యెవరండినూసేది
మంచమెక్కి నాక మనలో మాట!

### మోక్షసామ్రాజ్యమ్ము

బోయ శబరి దెచ్చె మోక్షసామ్రాజ్యమ్ము
పక్షిరాజా దెచ్చె పరమ పథము
రాతి నాతిజేసె రామయ్య పథసేవ
ఇంత కంటె కలదె యిహము పరము

### సాయి, రమ్ణ మహర్షి

సాయిబాబ నీకు సాక్షాత్తు దేవుండు,
రక్షకుండు నీకు రమ్ణ మహర్షి
ఏడుకొండలోడు ఏమైయ్యి పొయినట్టు
పాత బంగారము పనికి రాదు!

మానవుడే దేవుడ్రా
దేనికి సంశయము వేరె దేవుడు లేడూ
నేని విషయము చెబితే
లేని పోని రగడ, కవిది లెక్కాపక్కా!

### ఎన్టి రామారావు

ముఖ్యమంత్రి పదవి మూనాల్లభోగాతం
ప్రైమినిష్టరు పదవి పద్దినాలె
ఏట్ బాధైంది, ఎందుకీ ఉబలాటం
ఎన్టియార్! పెద్ద తంటాటేరం!

### శ్రీమతి లక్ష్మి దేవమ్మ

మరతుపాకి గుండ్ల ఎరయయ్యె నీ భర్త
కాలవాహినిలో కలిసిపోయె
చింతపడకు చెల్లి, శ్రీలక్ష్మి దేవమ్మ
చేయిజారినాక చేసెదేంటి!

### మూషికాలు

పగలు రెయ్యి వచ్చి పాడు జేస్తున్నాయి
మూషికాలు వాటి ముండమొయ్య
ఆదినాల్లో కొన్న అప్పొసప్పొదెచ్చి
వందలాది, కవిని గ్రంధములను!

## నెల్లూరు సంగతులు

(4 పేజి తరువాయి)

తెలుసు కాబట్టే భూసంస్కరణలు, ఆర్థిక విప్లవం, సామాజిక విప్లవాలను రూపకల్పన చేసి ప్రగతి బాటన నడుస్తున్నది. రాజీవ్ గాంధీ రాజకీయాల్లో ప్రవేశించినప్పుడు పైలెట్ అని సంశయించిన వారే తరువాత ప్రశంసించారని ముగించారు. పంచాయితీలను పటిష్టం చేయడంలో రాజీవ్ గాంధీ ప్రవేశ పెట్టిన రోజ్‌గార్ పథకాన్ని మరువలేమని ప్రభుత్వ విప్ శ్రీ సి.వి. శేషారెడ్డి అన్నారు. రాజీవ్ గాంధీ అమరుడై కాంగ్రెస్ ప్రభుత్వానికి జవ సత్వాలు ప్రసాదించారని డి.సి.సి. అధ్యక్షుడు ఆనం సంజీవ రెడ్డి కొనియాడారు. జిల్లా కేంద్ర సహకార బ్యాంకు అధ్యక్షుడు వేమారెడ్డి రామచంద్రా రెడ్డి, కె.వి. సుబ్బారెడ్డి, డి.సి.సి. కార్యదర్శి సి.హెచ్. దేవకుమార్ రెడ్డి, యువ కాంగ్రెస్ అధ్యక్షుడు సునీల్‌కుమార్ రెడ్డి సభలో పాల్గొన్నారు.

### స్వామి చిన్మయానంద సంస్మరణ సభ

స్వామి చిన్మయానంద సంస్మరణ సభను నెల్లూరు చిన్మయా మిషన్ 23 తేది సాయిబాబా మందిరం హాలులో జరిపింది. ముఖ్య అతిథిగా విచ్చేసిన ఆనందా శ్రమాధిపతి, ప్రసన్నానంద స్వామి మాట్లాడుతూ సనాతన ధర్మ సముద్ధరణకు, మానవాళి వికాసానికి స్వామి చిన్మయానంద శ్రమించారని వుద్ఘోధించారు. భరద్వాజా శ్రమాధిపతి గంగాధరానంద గిరి స్వామి, సత్యానందా శ్రమాధిపతి బ్రహ్మానంద స్వామి, చిన్మయామిషన్ నెల్లూరు జిల్లా అధ్యక్షులు శ్రీ కొండా బలరామిరెడ్డి స్వామి వుదాత్త సేవలు వివరించారు. చివరన కె. నారాయణ రెడ్డి వందనాలతో సభ దిగ్విజయంగా ముగిసింది.

### రామచంద్ర రావుకు బెయిల్

పోలీసు అరెస్టుకు నిరసనగా గత పదిహేను రోజులుగా దళిత సంఘాలు, పౌర హక్కుల సంఘాలు ఆందోళన చేస్తున్న ఉపాధ్యాయుడు ఇ. రామచంద్ర రావుకు జిల్లా జడ్జి శ్రీ ఇస్మాయిల్ కండిషన్డ్ బెయిల్ మంజూరు చేశారు. రామచంద్ర రావు దగదర్తి జడ్.పి. హై స్కూలులో పని చేసిన సమయంలో విద్యార్థులకు పాఠాలకు బదులుగా లెనిన్-మార్క్సిస్టు సిద్ధాంతాలు బోధించే వారని, కుంటాలమ్మరిలో జరిగిన ఎన్‌కౌంటర్‌లో మరణించిన ఆర్. మాల్యాద్రి ఈ ఉపాధ్యాయుడి వల్లనే ఉత్తేజితు డయ్యాడన్నది పోలీసుల ఆరోపణ. ఈ అభియోగంతో పబ్లిక్ సెక్యూరిటీ యాక్ట్ సెక్షన్ క్రింద ఆగస్టు 4 తేది రామచంద్రరావును అరెస్ట్ చేసి రిమాండ్‌కు పంపారు. తొలుత రామచంద్ర రావు పెట్టుకొన్న బెయిల్ దరఖాస్తును జిల్లా జడ్జి 12 తేది కొట్టి వేసినా 23 తేది మళ్లీ వాదనలు విని కండిషన్డ్ బెయిల్ ఇచ్చారు. విడుదలైన రామచంద్రరావు తన పై ఎస్.పి. చేసిన ఆరోపణలు నిరూపిస్తే ఉరిశిక్షకైనా సిద్ధమని ప్రెస్ క్లబ్‌లో పత్రికల వారికి చెప్పారు. కలెక్టర్‌గా రాజా వున్నప్పుడు ఈ ఉపాధ్యాయుడు ఆయనతో కలసి పలు సభలలో పాల్గొన్నాడని దళిత సంఘాలు చెబుతున్నాయి.

### గ్రామోదయకు దరఖాస్తులు

1993 - 94 సంవత్సరానికి గ్రామోదయ పథకానికి దరఖాస్తులు కోరబడుతున్నాయి. 10 తరగతి లేదా ఐ.టి.ఐ పాసైన, 18 - 35 మధ్య వయస్సు గల యువతీ యువకులు దరఖాస్తు చేయవచ్చు. వారి కుటుంబాదాయం పదివేల రూపాయలకు మించ కూడదు. సెప్టెంబర్ 20 తేది లోగా పూర్తి చేసిన దరఖాస్తులను జనరల్ మేనేజర్, జిల్లా పరిశ్రమల కేంద్రం, నెల్లూరు - 4. అనే చిరునామాకు పంపాలని కోరుతున్నారు.

### మోటారు కేసుల పరిష్కారం

జిల్లా కోర్టు, అదనపు జిల్లా కోర్టులలో పెండింగ్‌లో వున్న 42 మోటారు ప్రమాద కేసులను శనివారం నాడు జరిగిన లోక్ అదాలత్‌లో పరిష్కరించారు. బాధితులకు 13.32 లక్షల మేర నష్ట పరిహారం చెల్లించేలా చేశారు. అదనపు జిల్లా జడ్జి ఎస్. సూర్యనారాయణ, న్యాయవాది రంగనాథం లోక్ అదాలత్‌లో పాల్గొన్నట్లు జిల్లా జడ్జి ఇ. ఇస్మాయిల్ తెలిపారు.

## ఉత్తమావకాశం

(4 పేజి తరువాయి)

భాష వంటి వాటిలో పాఠ్యాంశాలు బోధిస్తారు.

### టివి

దూరపు విద్యా విధానంలో విప్లవాత్మక అభివృద్ధికి చిహ్నం - టివి మొదట ఇంగ్లండ్‌కు చెందిన బిబిసి తన ప్రసారాలలో కొంత సమయాన్ని విద్యా బోధనకు కేటాయించి మార్గదర్శకత్వం వహించింది. ఆ తర్వాత అన్ని దేశాలూ దీన్ని అనుసరించాయి. మనదేశంలో మొదటగా, ఢిల్లీలో యునెస్కో సహకారంతో టి.వి. పాఠాలు ప్రారంభించారు. ఇప్పుడు ఉపగ్రహాల సౌకర్యం కల్గడంతో దేశవ్యాప్తంగా అన్ని టి.వి. కేంద్రాలూ విద్యాబోధనకు విశేష కృషి సల్పుతున్నాయి. శాస్త్రీయ పరమైన ఎన్నో అంశాలను సుబోధకం గావిస్తున్నాయి. చిన్న పిల్లలు, స్కూలు కాలేజి విద్యార్థులు, వయోజనుల కోసం పలు కార్యక్రమాలు రూపొందిస్తున్నారు. శాస్త్ర సాంకేతిక విజ్ఞానం అభివృద్ధి చెందే కొద్దీ, విద్యా పద్ధతులనూ మెరుగు పరుస్తున్నారు. టి.వి. లో పాఠం వింటూ, సందేహాలు కల్గితే అప్పటికప్పుడు టివి కేంద్రానికి ఫోన్ చేసి, నివృత్తి చేసుకొనే నదుపాయమూ కల్పించారు. కంప్యూటర్ల వినియోగం వల్ల బోధనా పద్ధతి ఎంతో మెరుగు పడింది. క్లాసు రూంలో పాఠం వినేకంటె సౌకర్యంగా వివిధ పరికరాలు ప్రదర్శించి విద్యార్థులకు చదువు నేర్పుతున్నారు.

దూరపు విద్యా విధానం వల్ల పాఠశాలలకు వెళ్లి చదువుకోలేని వారికి ఎంతో వుపయోగం కల్గుతున్నది. రైతులు, కార్మికులు, ఉద్యోగులు తమ బ్రతుకు తెరువు చూసుకొంటూనే చదువు కొనసాగించే వీలు ఏర్పడుతున్నది. స్కూళ్లు, కాలేజీలు పెద్దగా అభివృద్ధి చెందని ఈశాన్య రాష్ట్రాలలో, లడక్ వంటి ప్రాంతాలలోని ప్రజలకు విద్య నందించ గల్గుతున్నారు. వయోజనులు, విద్యార్థులు కూడా అత్యుత్తమ బోధనా పరికరాలు, అత్యంత నిపుణులైన వారి బోధన పొంద గల్గుతున్నారు. ఫీజులు, పాఠ్య పుస్తకాల ఖర్చు చాలా తక్కువ. అందువల్ల ప్రజల పై ఆర్థిక భారం పడదు. దేశమంతటి ప్రజానీకానికి ఒకే రకమైన విద్య నేర్పబడుతుంది; అవగాహన కల్పింప బడుతుంది.

అయితే ఇందులోనూ కొన్ని లోపాలు లేకపోలేదు. ఈ విద్యా విధానంలో విద్యార్థికి, అధ్యాపకుడికి ప్రత్యక్ష సంబంధం వుండదు. విద్యార్థుల సందేహాలకు అప్పటికప్పుడు సమాధానాలు లభించవు. ఈ లోపాన్ని నివారించడానికి కాంటాక్ట్ క్లాసులు నిర్వహిస్తున్నారు. వైద్యమూ, ఇంజనీరింగ్ వంటి సాంకేతిక విద్యలు దూరపు విద్యా విధానానికి దూరంగా వున్నాయి. అయితే టివిలో కొన్ని శాస్త్రపరమైన అంశాలనూ బోధించి ఈ కొరతను కొంతకు కొంత తీరుస్తున్నారు. చాలా ప్రైవేటు సంస్థలు, కొన్ని విశ్వవిద్యాలయాలు దీనిని వ్యాపార దృష్టితో నిర్వహిస్తున్నాయి. దీనిని నివారించాలి.

పెరిగిపోతున్న జనాభాకు విద్యను అందించడం, నిరక్ష రాస్యతను ప్రారద్రోలడానికి - దూరపు విద్యా విధానం కంటె మెరుగైన పద్ధతి మరొకటి లేదు. దీన్ని మరింత ఆధునీకరించి, ప్రజలకు చేరువ చేయడానికి అందరూ కృషి సల్పాలి.

జమీన్ రైతు
సంవత్సర చందా రు 100/-
6 నె లలకు- రు.50/-
విడిప్రతి - రు. 2.00

## In the Addl. Motor Accidents Claims Tribunal, Nellore (Addl. Dist. Judge)

O.P. 203 / 92

Kavali Bala Subrahmanyam being minor rep. by his father and guardian kavali Satyanarayana - Applicant

Vs

I. Venkateswarlu Reddy & Others - Respondents

To
R3, Mannem Penchala Reddy, S/o. Malla Reddy
Owner of Lorry AAN 5843.
D.No. 6/31, Lakshmipuram,
Nellore Town

అప్లికెంటు యం.వి. అక్టు క్రింద కాంపెన్‌జేషన్ కొరకు పై ఓ.పి. దాఖలు చేసియున్నారు. కనుక నీకు ఆక్షేపణలు యున్న యెడల 26.10.1993 తేది పగలు 10 గంటలుపై కోర్టులో హాజరయి తెలుపుకో వలెను. లేని యెడల యక్స్‌పార్టీ చేయుదురని మీకు తెలియజేయడమైనది.

పి. మధుసూదన రెడ్డి,
పి. సుధాకర రెడ్డి
అప్లికెంటు తరపున అడ్వోకేట్లు

# రవిక వెనుక...



దేశమంతటినీ కవ్వించిన 'ఖల్‌నాయక్' మాధురీ దీక్షిత్!

సినిమా ప్రపంచంతో సంపర్కం కల్గిన కోట్లాది మందిని నిద్ర పట్టకుండా చేస్తున్న చిక్కు ప్రశ్న ఇది. వీధిలో రిక్షా వాలా, టీ బంకుల్లో ఛాయ్ వాలా, కాలేజీల్లో పిల్లల గోల, ఇళ్లలో పాయుంత్రం సరదా చర్చల లీల, చివరకు కోర్టుల్లో, పార్లమెంటులో కూడా ఎంత చర్చించినా రవిక వెనుక దాగి వున్నదేమిటో అర్థం గాక జనం తలలు బాదుకుంటున్నారు. ఇప్పటికి కోటి పాటల క్యాసెట్లు అమ్ముడైన 85 కోట్ల ప్రజానీకం చెవుల్లో ఈ ప్రశ్న గింగురు మనేట్లు చేస్తున్నాయి. అనధికారంగా అమ్ముడైన క్యాసెట్ల సంఖ్య అంకెంతో చెప్పలేము

''చోలీ కె పీచే క్యాహై
చునరి కె నీచె క్యాహై''

## ఒక్క పాట ఎంత సంచలనం సృష్టించింది?

ఈ రెండు చరణాలూ వినని భారతీయుడు ఈ రోజు ఎవరూ లేరు. దేశమంతటా మైకులను హోరెత్తిస్తున్నదది. భారతీయులకు సహజంగా సంగీతమంటే మోజు. నారు వేతలు పరికోతల నుంచి పెళ్లిళ్లు పేరంటాల వరకు నిత్య జీవితంలో ప్రతి భాగంలోనూ సంగీతం ప్రమేయం వుంది. పాట మన జీవితంలో ఒక భాగం. పొట్ట పొడిస్తే అక్షరం ముక్క రాని పల్లె జనం నోట కూడా, నారు కట్లు చేత పడితే కమ్మటి పాటలెన్నో జాలు వారుతుంటాయి. పాటల్లో శృంగారం మిళితం చేయడం జానపదుల కాలం నుంచి అలవాటే. చేస్తున్న శ్రమను మరపించి మానసికోల్లాసం కల్పించడానికి హాస్య, శృంగార రసాలు రెండూ దివ్య ఔషధ గుళికల వలె పనిచేస్తాయి. పాటతో, సంగీతంతో అంతగా మమేకం చెందబట్టే మన సినిమాలు పాట లేనిదే తెర పైకి రాలేకున్నాయి. పాటలేని సినిమా ఒక్క పూట హాల్లో వుండలేదు.

సినిమా పాటల్లో, మరీ ముఖ్యంగా హిందీ సినిమా పాటల్లో ఒక్కొక్కసారి ఒక్కొక్క పాట జన

కొరవ 11 పేజీలో

# దాగిన రహస్యమేమిటి?

# మరీ ఇంత దురభిమానమా?

హీరో కృష్ణతో తమ్మారెడ్డి భరద్వాజ దర్శకత్వంలో ఇటీవలే రీరికార్డింగ్ పూర్తి చేసుకొన్న ''రౌడీ అన్నయ్య'' చిత్రం సెప్టెంబర్ 11న విడుదల కానుంది. ఉన్నట్లుండి ఆ చిత్రంలో హీరో పైన ఆరు పాటలు

> **ఆరు పాటలు లేకుంటే వప్పుకోమని నిర్మాతకు కృష్ణ అభిమానుల హెచ్చరిక**

వుండాలని, లేకపోతే తీవ్రమైన ఆందోళన జరుగుతుందని 'కృష్ణ యువసేన' వ్యవస్థాపక అధ్యక్షులు దిడ్డి రాంబాబు, కాశేరు శ్రీనివాస రావుల సంతకాలతో హెచ్చరికగా ఒక ఉత్తరం వచ్చింది. తమ్మారెడ్డి భరద్వాజ దీనిని ఖండిస్తూ ''కథకు అవసరం కొద్ది పాటలు ఉంటాయి గాని, ఒకరి ఆదేశాల మేరకు పాటలు పెట్టడం మొదలు పెడితే, ఏం బావుంటుంది? అభిమానులు మరీ ఇంత చొరవ తీసుకోవడమా?'' అని బాధపడ్డారు.

### ''జెంటిల్ మన్''

''ఈ రోజుల్లో డబ్బున్న వారికే ప్రొఫెషనల్ కాలేజీలలో సీట్లు దొరుకుతున్నాయి. నిరుపేద కుటుంబంలో జన్మించిన తెలివైన కుర్రాడు ఏ డాక్టరో, ఇంజనీరో కావాలను కుంటే గగన మై పోతున్నది. ఈ వలయాన్ని ఛేదించడానికి ఓ యువకుడు దోపిడీ దారుగా మారుతాడు. ఆఖరికి పోలీసులకు దొరికిపోయిన అతను తానలా మారడానికి ముఖ్యమంత్రే కారకుడని కోర్టుకు ముఖ్యమంత్రిని రావించేలా చేస్తాడు. నేటి ఉన్నత విద్యల స్థితి గతులకు అద్దం పట్టే ఈ చిత్రం తమిళనాడులో విజయఢంకా మ్రోగిస్తోంది. జెంటిల్ మన్ డబ్బింగ్ హక్కుల కోసం ఎందరో నిర్మాతలు పోటీ పడితే, అత్యధిక సొమ్ముతో నేను దక్కించుకొన్నాను'', అన్నారు — బుచ్చిరెడ్డి పాళెం వాస్తవ్యుడైన ఎ.ఎం. రత్నం. అక్టోబర్ మొదటి వారంలో విడుదలయ్యే ఈ చిత్రంలో అర్జున్, చరణ్‌రాజ్, మధుబాల, నంబియార్, మనోరమ, శుభశ్రీ నటించారు. రచన: రాజశ్రీ. సంగీతం: ఎ.ఆర్. రెహమాన్.



అసాధ్యురాలు చిత్రంలో భానుమతి

# ఆయన కూతురునైతే పచ్చిగా చూపించాడు నన్ను వదిలేశాడు!

**—పూజాబేడి గోడు**

సెక్స్‌బాంబ్ పూజాబేడి, పూజాభట్‌తో కలిసి ఓ సినిమా తీయడానికి చీలవుతుందా? ఇది అసాధ్యమేమీ కాదని ఒక టెలిఫిలిమ్ ద్వారా నిరూపించాడు మహేష్‌భట్. ''ఆయన చెప్పిందొకటి, చేసిందొకటి. ఆయన ఇంతగా మాట తప్పుతాడను కోలేదు. ఆయన కూతురు పూజాభట్‌ను చూపించినంత సెక్సీగా నన్ను చూపించక నాకెంతో అన్యాయం చేశాడు'' అని వాపోయిందట పూజాబేడి!

### భంగపడ్డ భానుప్రియ

భానుప్రియను తెలుగు నిర్మాతలు దాదాపు విస్మరించినట్లే లెక్క. తమిళంలో కూడా అన్నీ కథానాయకుడి ప్రాధాన్యత ఉన్న చిత్రాలలోనే నటించడం వల్ల తాను రాణించక లేక పోతున్నానని భానుప్రియ ఆవేదన. అందువల్లే తనకు ప్రాధాన్యత ఉన్న చిత్రం ఒకదానిని స్వయంగా నిర్మించడానికి కథ కోసం అన్వేషించ సాగింది. ఇంతలో ''దామిని'' హిందీ చిత్రం ఆమె కళ్ళ బడింది. రీమేక్ హక్కుల కోసం ఆమె ప్రయత్నించేలోగానే మరో తమిళ నిర్మాత హుటాహుటిన బొంబాయికి ఎగిరి వెళ్లి, హక్కులను కొనేసి, రేవతి, ప్రభులతో తీయడానికి సన్నాహాలు చేస్తున్నాడు. భానుప్రియకు ఇంతకన్నా బాధ కల్గించే విషయం మరొకటి వుంటుందా?

# మాయలోడు — అంతా మాయ!

> **చిత్రసమీక్ష**
> **అల్లూరు రహీం**

మాయలోడు చిత్రం సాంఘిక చిత్రమా, జానపద చిత్రమా అన్న అనుమానం ఈ చిత్రం చూసిన ప్రతి ప్రేక్షకుడికీ కలగడం సహజం. చిత్ర నగ భాగం వరకు సాంఘిక చిత్ర ధోరణిలో కథ నడచి అకస్మాత్తుగా విఠలాచార్య బాణీలోనికి వెళ్లిపోతుంది. అకస్మాత్తుగా లాకప్‌లో వుండే హీరో అదృశ్యమై పోవడం, తిరిగి ప్రత్యక్ష మవడం జరుగు తుంటుంది. (ప్రపంచ ప్రఖ్యాతి గాంచిన మెజీషియన్ పి.సి. సర్కార్‌కు కూడా ఇది సాధ్యం కాదేమో?) పలు పాత్ర ధారులు కప్పులు, పిల్లులు, కోతులుగా మారి పోతుంటారు. మనుషులు మొండెం వరకు అస్థి పంజరాలుగా మారి డాక్టర్లకు ఎముకలు తీసి ఇస్తుంటారు. కథా సారంలేని చిత్రంలోని కథను మెలికలు తిప్పను ఏదో ఒక మెస్మరిజం చేసి ప్రేక్షకులను ఆకర్షించను దర్శకుడు ఎన్ని పాట్లు పడ్డాడంటే వాటిని చూసి మనకు జాలి కల్గి పోసిలే పాపం ఒకసారి సినిమా చూద్దాం అన్పిస్తుంది! అమ్మాయిల చేతిలో మోసబోయి ఎస్.ఐ. హోటల్లో పిండి రుబ్బుతాడు; మరోసారి అదే ఎస్.ఐ. మూతలేని హోల్‌స్టర్ నుండి రివాల్వర్‌ను ఐంకు, బొంకు లేకుండా హీరోయిన్ తీసుకొంటుంది. ఇటువంటి ఏర్పాటు పోలీస్ శాఖ చేస్తే దొంగల పని సులువవుతుందేమో! కనీస పాటి పరిచయంలేని హీరో, హీరోయిన్‌ల మధ్య 'ప్రేమ' అంకురించను సందర్భోచిత సన్నివేశమే లేదు కదా. ఆ విషయం హీరోయిన్ తండ్రికి తెలిసి ఆయన ఆగ్రహం కురిపించడం మరో ఖతి సన్నివేశం. ఇటువంటి సన్నివేశాలు రాసుకొంటూ పోతే 'మాయలోడు' చిత్రంలో కొకొల్లలు. కథ మొదలు దరిదాపులు అన్ని సాంకేతిక శాఖలూ నిర్వహించిన ఎస్.వి. కృష్ణారెడ్డి అఘోరించిన దర్శక ప్రతిభకు కొలమానమీ చిత్రం. హాస్యం పేరుతో నానా అపహాస్యపు, అర్థం, పర్థం లేని పోకడలను సృష్టిస్తున్న ఇటువంటి గొప్ప దర్శకులు, తెలుగు ప్రేక్షకులను ఏమనుకొంటున్నారో అర్థం కావడం లేదు.

వీరబాబు (రాజేంద్ర ప్రసాద్) బ్రతుకు తెరువు కోసం గారడీ చేస్తుంటాడు. ఒక ప్రదర్శన ముగించు కొంటున్న సమయంలో తల్లిదండ్రులను కోల్పోయిన ఒక పాప (నికిత) కంట పడుతుంది. ఆ పాప తల్లిదండ్రులను ఆస్తి కోసం మామ అప్పలకొండ (కోట శ్రీనివాస రావు) హత్య చేస్తాడు. తప్పించుకొన్న పాప వీరబాబు పెంపకంలో వుండి గారడీ నేర్చు కొంటుండగా ప్రమాదవశాత్తు కళ్లు పోగొట్టు కొంటుంది. ఆమె ఆపరేషన్ కోసం తన ఖర్చులన్నీ తగ్గించుకొని డబ్బును వడ్డీ వ్యాపారి పద్మనాభం) వద్ద కూడ బెడతాడు. పాపకు ఆపరేషన్ సిద్ధమైన సమయంలో దాచుకొన్న డబ్బులు అడగబోతే, ఆ వ్యాపారి తన కూతురు శ్రీ (సౌందర్య) ను వీరబాబు ప్రేమిస్తున్నందున డబ్బు ఇవ్వనంటాడు. విషయం విని కోపంతో వూగిన వీరబాబు, అతన్ని కాళ్లు చేతులు కట్టి పడేసి బీరువాలోని తన వంతు డబ్బు పట్టుకెళతాడు. ఈ విషయాన్ని చాటుగా చూసిన అప్పలకొండ వ్యాపారిని హత్యచేసి, మిగతా డబ్బులు పట్టుకెళ్లగా ఆ హత్యానేరం వీరబాబు పై పడి పోలీసులు అరెస్ట్ చేయడం, పాప ఆపరేషన్ ఆగి పోవడం జరుగుతుంది. వీరబాబు పోలీస్ స్టేషన్‌లో వున్నాడని పాపను హత మార్చాలని అప్పలకొండ పన్నిన పథకాలను నానా జిమ్మిక్కులు చేసి అడ్డుకొని వమ్ము చేసి పాప అసలు హంతకులను జైలు పాలుచేస్తాడు వీరబాబు.

సారం లేని కథైనందు వల్ల దర్శకుడు 'మాయల మరాఠీ' ని ఆశ్రయించి నానా హంగామా సృష్టించి ప్రేక్షకులను ఆకట్టు కోవాలని ప్రయత్నించాడు. అందుకోసం కథను మించిన కామెడీ ట్రాక్‌ను సృష్టించి అందులో ఎస్.ఐ. ఆనందం (బ్రహ్మానందం) వంటి (బాబూ మోహన్), పండు (గుండు హనుమంత రావు), కానిస్టేబిల్ (ఆలీ) లను వుపయోగించు కొన్నాడు. వీరందరితో తీసిన ఒక ట్రిక్‌రాస్

కొరవ 11 పేజీలో

# చెన్నా, వైఎస్ వర్గాలకు ప్రాతినిధ్యం?

మేరకు తెలంగాణా ప్రాంతానికి చెందిన సంతోష్ రెడ్డి, నరసింహా రెడ్డి, సమర సింహా రెడ్డిలను మంత్రి వర్గం నుంచి తొలగించే అవకాశముంది. అలాగే తూర్పు గోదావరి జిల్లాకు చెందిన కుడిపూడి ప్రభాకర రావు, సిహెచ్ మోహనరావులకు కూడా ఉద్వాసన చెబుతారట. గుంటూరు జిల్లాకు చెందిన మహమ్మద్ జానీని కూడా మంత్రి వర్గం నుంచి బయటకు పంపే అవకాశ ముంది. కాగా పై మంత్రుల్లో సమరసింహా రెడ్డి

**ఉద్వాసన:**
సంతోష్‌రెడ్డి
నరసింహా రెడ్డి
కుడిపూడి
మోహనరావు
మహమ్మద్ జాని

**అవకాశం:**
డిఎల్ రవీంద్ర రెడ్డి
సంగీతం
లక్ష్మీదేవి
శశిధర్‌రెడ్డి
జగన్మోహన రావు

సమర్థతను దృష్టిలో పెట్టుకొని మంత్రి వర్గంలో కొనసాగ నివ్వాలన్న సూచనలు అందుతున్నాయి. అయితే మహబూబ్ నగర్ జిల్లా నుంచి బి.సి.లకు చెందిన చిత్తరంజన్‌ను మంత్రి వర్గంలో తీసుకునే పక్షంలో సమరసింహా రెడ్డి, 'ఔట్' కాక తప్పదంటున్నారు.

ఈసారి జరిగే చేర్పుల్లో ప్రధానంగా వై.ఎస్. రాజశేఖర రెడ్డి, మర్రి చెన్నారెడ్డి వర్గీయులకు ప్రాతినిధ్యం కల్పిస్తారు. రాజశేఖర రెడ్డి గ్రూపుకు సంబంధించి కడప నుంచి డి.ఎల్. రవీంద్రా రెడ్డి, అనంతపూర్ జిల్లా నుంచి శ్రీమతి లక్ష్మీదేవి, తూర్పు గోదావరి జిల్లా నుంచి సంగీతం వెంకట రెడ్డిలకు ఖాయంగా మంత్రి పదవులు దక్కుతా యంటున్నారు. అలాగే చెన్నారెడ్డి కుమారుడు మర్రి శశిధర్ రెడ్డి పేరు ఖరారైందని తెలుస్తోంది. గుంటూరు జిల్లాకు చెందిన మహమ్మద్ జానీని తొలగించి కృష్ణాజిల్లా విజయవాడకు చెందిన బేగ్‌ను మంత్రి వర్గంలోకి తీసుకుంటారట. ప్రస్తుత మంత్రి వర్గంలో శ్రీకాకుళం నుంచి చిత్తూరు జిల్లా వరకు 'రెడ్డి' కులస్తుడైన మంత్రి లేక పోవటంతో చిత్తూరు జిల్లాకు చెందిన కిరణ్ కుమార్ రెడ్డిని మంత్రి వర్గంలోకి తీసుకొని ఆ లోటును భర్తీ చేస్తారట. విజయనగరం జిల్లా నుంచి జగన్మోహన రావును మంత్రి వర్గంలో తీసుకుంటే 'కాపు'లకు ప్రాధాన్యం ఇచ్చినట్లుంటుందని ముఖ్యమంత్రి భావిస్తున్నారు. అయితే విజయనగరం నుంచి . ఇప్పటికే సాంబశివ రాజా మంత్రి వర్గంలో ఉన్నారు. మాజీ మంత్రి శ్రీ జనార్దన రెడ్డికి రామభక్తుడైన సాంబశివ రాజాను

## ముఖ్యమంత్రి

(మొదటి పేజి తరువాయి)

తొలగిస్తారా? లేక అదనంగా జగన్మోహన్ రావును తీసుకుంటారా? అన్నది వేచి చూడాల్సిందే. ఉత్తరాంధ్ర జిల్లాల నాయకుడు ఎంపి ద్రోణంరాజు గ్రూపుకు చెందిన బాలరాజును కూడా మంత్రివర్గంలోకి తీసుకో వాలన్న ప్రతిపాదన ఉంది. బాలరాజు గిరిజనుడు కావటం వల్ల ముఖ్యమంత్రి ఇందుకు అంగీకరించ వచ్చు. ముఖ్యమంత్రి సొంత జిల్లా కర్నూలు నుంచి ఆయన ప్రత్యర్థి కె.ఇ. కృష్ణమూర్తికి ఈసారి మంత్రిత్వం ఖాయమని అంటున్నారు. త్వరలో జరుగనున్న కర్నూలు లోక్‌సభ ఎన్నికల్లో ముఖ్యమంత్రి కుమారుడు కె. ప్రకాష్ రెడ్డి పోటీ చేయనున్న దృష్ట్యా

## నెల్లూరుకు నో ఛాన్స్ – నేదురుమల్లి మాటే శిలాశాసనం!

కె.ఇ.ని మంత్రి వర్గంలోకి తీసుకుంటే 'విజయం' గ్యారంటీ కాబట్టి ముఖ్యమంత్రి పాత పగలను మరచి పోయి కె.ఇ.తో స్నేహ హస్తం కలపవచ్చు. నెల్లూరు జిల్లాలో పసల పెంచలయ్యకు ధోకాలేదు. అయితే కావలి ఎమ్మెల్యే కలికి యానాదిరెడ్డి, సర్వేపల్లి ఎవ్ సి.వి. శేషారెడ్డి పేర్లను కూడా ముఖ్యమంత్రి పరిశీలిస్తున్నట్లు ప్రచారం జరుగుతోంది. యానాదిరెడ్డి మాత్రం క్రమం తప్పకుండా ముఖ్యమంత్రిని కలుసుకుంటూ మంత్రిత్వం కావాలని పోరు పెడుతున్నారట. నెల్లూరు జిల్లాకు సంబంధించినంత వరకు మాజీ ముఖ్యమంత్రి శ్రీ నేదురుమల్లి మాటకే ముఖ్యమంత్రి విలువిస్తారు కాబట్టి 'ఫలితం' ఎలా ఉంటుందో వేచి చూడాల్సిందే. కానీ మంత్రి వర్గ విస్తరణలో సంఖ్య కులాల వారీగా చూస్తే నెల్లూరు జిల్లాకు రెండో మంత్రిత్వం అనుమానాస్పదమే.







## రవిక

(9 పేజీ తరువాయి)

హృదయాలను రంజింప జేస్తుంటుంది. కేవలం పాటల పొంపులో సూపర్ హిట్లైన సినిమాలు ఎన్నో!

"మైన్యా కరూ రా ముజె బుడ్డా మిల్‌గయా" అంటూ వైజయంతి మాల కవ్వింపుగా కొంటె పాట పాడితే అలనాటి భారత యువతరం ఎంత పిచ్చెక్కిపోయిందీ మనం చూడనే చూశాం కదా! అదే రాజ్‌కపూర్ బాబీలో డింపుల్ కపాడియా వంటిని తడిపి, వంపులు చూపుతూ 'హమ్ తుమ్ ఏక్ కమరేమే బంద్ హో' పాట విన్పిస్తే — సినిమా హాళ్లలో జనం ఎట్లా విరగబడి పోయిందీ మనకు తెలుసు.

ఆ రోజుల్లో ఆ పాటలే అసభ్యతా విమర్శల న్పించాయి. సాంప్రదాయ వాదులు సన్నాయి నొక్కులు నొక్కినా, అవి యువతరం హృదయాలలో రేకెత్తించిన హోరు ముందు ఎవరికీ విన్పడలేదు. ఇప్పుడు "రవిక" పాట గతీ అంతే!

రవిక వెనుక ఏముందన్న చరణం వినగానే ఎవరికైనా — "ఛీ, ఏమిటిది ఛండాలం, సిగ్గు లేకుండా" అన్పిస్తుంది. కాని ఆ తర్వాత చరణం కూడా వింటే — రవిక వెనుక, పైట క్రింద దాగింది 'హృదయం' మాత్రమేనని కవి చమత్కారమాడితే ఇంతేనా అన్పిస్తుంది! పై రెండు లైన్ల నుంచి క్రింది రెండు లైన్లు వినే మధ్య అర సెకను కాలంలో ఎక్కడెక్కడికో వెళ్లే మన వూహలు ఒక్కసారిగా క్రిందకు వాలిపోతాయి. అంతరంగాన్ని నిజం చెప్పమని నిలదీస్తే — సగం జనాభాకు — కవి చేసిన చమత్కారం అసంతృప్తి కల్గిస్తుందన్న నిజం.

ఈ పాట పై ఎంత రచ్చ, ఎంత చర్చ? ఢిల్లీ లాయర్ ఆర్‌పి ఛుగ్ అయితే ఏకంగా కోర్టులో కేసే వేశాడు — ఈ పాటను నిషేధించమని. పాపమాయన తన మూడున్నరేళ్ల కొడుకును తీసుకొని కూరగాయల మార్కెట్‌కు వెళ్లారట; వాడా స్కూటర్ పై కూర్చుని వచ్చీ రాని పలుకులతో ఈ పాట పాడేటప్పటికి దారిన పోయే ఆడవాళ్లు కావాలని తమని అల్లరి పట్టించడాన్కి ఈయన వాడి చేత ఆ పాట పాడిస్తున్నాడని అసహ్యించు కున్నారట. ఆయన నేరుగా పోలీసుకు ఫిర్యాదు చేశాడు — పాటను నిషేధించమని. కాని ఢిల్లీ కమీషనర్ గారు "నా ఆరేళ్ల కొడుకు కూడా అదే పాట వద్దన్నా పాడుతూ నా ప్రాణం తోడేస్తున్నాడు — సెన్సార్ అనుమతి ఇచ్చిన తర్వాత నేనేమి చేయలేను. మీరే కోర్టుకు వెళ్లి పుణ్యం కట్టుకోండి" అని సలహా ఇచ్చి పంపేశారు. ఛుగ్ గారు వీరావేశంగా కోర్టుకు వెళ్లారు కాని — రవిక వెనుక వుండేది హృదయం మాత్రమేనని హై కోర్టు న్యాయమూర్తి నమ్మేసి, నవ్వేసి, భారతీయులంతా నిక్షేపంగా ఆ పాట విని ఆనందించ వచ్చుని తీర్పు చెప్పేశారు.

ఈ ఒక్క పాటలో కోట్లాది సినిమా ప్రేక్షకుల మతులు పోగొడుతున్న "ఖల్ నాయక్" బాక్సాఫీసులు బద్దలు కొట్టేస్తున్నది. హైదరాబాదులో పది రూపాయల టికెట్ వంద రూపాయలకు బ్లాక్‌లో అమ్ముడు పోతున్నది. ఇంత చరిత్ర సృష్టించిన ఈ పాట అసలెట్లా ఆవిర్భవించింది. ఖల్ నాయక్ నిర్మాత సుభాష్ ఘాయ్ ఒకసారెప్పుడో రాజస్థానీ జానపద సంగీతం వింటూ "కు... కు... కు... కు..." అనే ట్యూన్‌కు ముగ్ధులైనాడట. ఆ రాగంలో ఒక పాట వ్రాయమని ఆనంద్ బక్షికి ఫోన్ కొట్టారు. రెండు రోజుల తర్వాత బక్షి గారు తిరిగి ఫోన్ చేసి "రవిక వెనుక ఏమి దాగివుంది, పైట క్రింద ఏమి దాగి వుంది" అనే చరణం విన్పించారట. రవిక క్రింద దాగిన పాట గురించి సినిమాలో పాడించమంటారా, మరీ అంత బూతా అని విస్మరపడ్డారట ఘాయ్‌గారు. బక్షి చిద్విలాసంగా నవ్వి, తక్కిన రెండు చరణాలూ విన్పించి, అది హృదయం మాత్రమేనని తేల్చి చెప్పి, స్వాంతన పరిచారట. రవిక మీద ఇంత రచ్చ ఎందుకు, కాళిదాసు కవితలో రాధ రవిక సౌందర్యాన్ని వర్ణించ లేదా, ఎన్ని జానపద గీతాలలో చెమట చిత్తడిలో తడిసిన రవికల ప్రస్తావన లేదు. నా సినిమా రవిక ఒక్కటే దొరికిందా మీ అందరికీ అని సుభాష్‌ఘాయ్ గారు గయ్‌మని లేస్తున్నారు విమర్శకుల మీద. తన రవిక పాటలో అసభ్యత అన్నదే లేదు పొమ్మంటున్నారు.

ఈ పాటకు నృత్యం చేసిన మాధురీ దీక్షిత్ నీనా గుప్తలు కూడా ఇందులో సిగ్గు పడాల్సింది, అసహ్యించు కోవాల్సింది ఏమీ లేదని తేల్చి పారేశారు. దీనికి సరైన నటన చెస్తే లైమ్‌లైట్‌లోకి రావడానికి ఛాన్స్ వుందని నాకు తెలుసు — అదే జరిగింది — అంటుంది నీనా గుప్త. కఠిన హృదయుడైన ఒక విలన్‌ను మైమరపించి మధ్య పెట్టి, లొంగదీయాలంటే ఆడ మనిషికి అందంతో పాటు ఘాటైన కొంటె చూపులు, కొట్టచ్చినట్లు కన్పించి కవ్వించే హావ భావాలు కావాలి— అవి రెండూ వున్నందు వల్లనే నీనా గుప్తను ఎంపిక చేశాము అంటాడు సుభాష్ ఘాయ్.

ఛోళీ పాటతో హిందీ సినిమా రంగంలో మరొక శకం ప్రారంభమైంది. వైజయంతి మాల "బుడ్డా మిల్ గయా" లు, జీనత్ అమన్ "హరే రామ హరే కృష్ణ"లు, ముంతాజ్ "ధమ్ మారో ధమ్" లు ఇటీవల వచ్చిన "ఇలూ ఇలూ క్యాహై", "జుమ్మా చుమ్మా" "ఏక్ దో తీన్" వెనుకబడి పోయి ఇప్పుడు ఎవరి నోట వెంట విన్నా 'ఛోళీ' మార్మోగుతూంది. సభ్యతాసభ్యతల మీమాంస వదిలేస్తే ఒక్క పాటతో ఇన్ని కోట్ల జన హృదయాలను రంజింప చేయగల్గిన గాయని — ఇలా అరుణ్ అదృష్టవంతు రాలు.

* * *

కాపీ కొట్టుడు విద్యలో సినీ జీవులు పిహెచ్‌డిలకు అర్హులైన ప్రతిభా వంతులు. 'ఖల్‌నాయక్' విజయ ఢంకా మ్రోగించ నున్నదన్న రహస్యం ముందుగానే పసిగట్టి పావన్ కుమార్ టక్ అనే మరొక నిర్మాత "ఖల్ నాయికా" అనే మరొక సినిమా మొదలు పెట్టేశాడు "టక్ మొహం, అతడు నేను తీసినంత స్పీడుగా సినిమా ఎక్కడ తీయగలడు" అనే ఉద్దేశ్యంతో, టక్ తన దగ్గరకు వచ్చి 'ఖల్‌నాయికా' పేరును స్మరింప జేసే 'ఖల్‌నాయక్' పేరు తన సినిమాకు పెట్టుకుంటానని అడిగితే సరేనన్నాడు; తీరా చూడబోతే ఘాయ్ కంటే ముందు టక్ ఆ సినిమా తీసేశాడు. పైగా 'ఛోళీకే పీచే క్యాహై' అన్నరాగంలోనే 'ఛోళీ అందర్ క్యాహై' అనే పాటను అందులో పెట్టాడు. అప్పుడు కలవరపడుతున్న సుభాష్ ఘాయ్ తత్తరపడి, ఎఫ్‌ఎంపికి ఫిర్యాదు చేస్తే — ఖల్‌నాయక్ విడుదలైన ఒక రోజు తర్వాత కాని ఖల్‌నాయిక విడుదల చేయడానికి లేదని తీర్పు చెప్పింది.

ఇంకొక ప్రక్క ఖల్‌నాయక్‌లో సంజయ్‌దత్ హీరో కావడంతో అతడు బొంబాయి బాంబు ప్రేలుళ్ల కేసులో అరెస్ట్ కాగానే శివసేన ఆ సినిమాను నిషేధించింది. బాలథాకరేను కాళ్లవేళ్ల పడి బ్రతిమలాడి, నిషేధం తొలగింప జేసే సరికి తలప్రాణం తోకకు వచ్చింది.

ఇన్ని కష్టాలు పడినా, సుభాష్‌ఘాయ్ శ్రమ వృధా పోలేదు; సినిమా సూపర్ హిట్!

(అన్‌లుకర్ ఆధారంగా)

## బూతు బొమ్మలు

(4 పేజీ తరువాయి)

రేటుకు విస్తృతంతో కొత్త సినిమా కళ్ల కాలిడికి కలెక్షన్స్ కరువైన 'అనిత' థియేటర్ ఇటువంటి సినిమాలను ఆశ్రయించింది. విజయవాడ నుంచి దిగుమతి చేసుకొన్నమలయాళం నుంచి డబ్బింగ్ చేసిన తెలుగు, హిందీ, ఇంగ్లీషు సినిమాలను ఈ థియేటర్‌లో యధేచ్ఛగా ప్రదర్శిస్తున్నారు. ఇటీవల అనిత థియేటర్‌లో ప్రదర్శించిన సుబ్బారావు శోభనం, వయసు వలపు, ఆదిమానవుల నవరసాలు, ఐడియల్ మ్యారేజ్, మ్యారేజ్ లైఫ్ చిత్రాల తాలూకు పోస్టర్లు మరీ బరితెగించి పోయాయి. రోడ్డు పై వీటిని చూచి తలదించుకొనే మహిళలు, విద్యార్థినులు, ట్రంకురోడ్డు, వి.ఆర్. కాలేజి ప్రాంతంలో చూస్తే కనిపిస్తారు. గత వారం శ్రీనివాస థియేటర్‌లో ప్రదర్శించిన 'కన్నెవేట' చిత్రం పోస్టర్ వీటి స్థాయిని మించింది. సెంట్రల్ సెన్సార్ బోర్డు అప్రూవల్ చేసిన ముద్ర పోస్టర్ల పై వుండడం నియమమైనా ఈ చిత్రాల పోస్టర్ల పై మచ్చుకైనా అది ఎక్కడా కన్పించదు. విజయమహల్ వీడియో థియేటర్ వారైతే ఈ విషయంలో అందరినీ మించి పోయారు. వీరు వేసే పోస్టర్లలో కేవలం పేర్లు మాత్రమే వుంటాయి. సినిమాలో 'బ్లూ' సీన్లు కోకొల్లలట. ఇండియాలో తయారైన ఇంగ్లీషు, మలయాళం, హిందీ రెడిమేడ్ సీన్లను నిల్వచేసి ప్రేక్షకులు ఈలలు వేసి గోల చేసినప్పుడు 16 ఎం.ఎం. తెర పై సాక్షాత్కరింప జేస్తున్నారు. ఇటువంటి సీన్లను పోలీసులు అరికట్టాల్సింది పోయి టౌన్‌లో బీటు డ్యూటీ వున్న వారంతా అది మానుకొని సెకండ్ షోకు ఈ థియేటర్‌లో వాలి వుంటారట. ఈ వీడియో థియేటర్ రేట్లు కూడా మిగతా వాటితో పోల్చుకొంటే తక్కువ కావడంతో జనం మరీ ఎగబడి పోతున్నారు.జనం బలహీనతలను సొమ్ము చేసుకొనే సినిమాలను ప్రదర్శించే ఈ థియేటర్ల వారు సెన్సార్ సర్టిఫికెట్ వుందని కుంటి సాకులు చూపవచ్చు. ఏది ఏమైనా మరీ బరితెగించిన పోస్టర్లను కూడళ్లలో అతికించే కార్యక్రమానికి స్వస్తి పలికించేలా జిల్లా యంత్రాంగం తగిన చర్యలు తీసుకొంటే బాగుంటుంది. రసిక హృదయుల మనసు నొప్పించే చర్యలు తీసుకొన్న మహిళా మణుల మనసు దోచుకునే అధికారి ఎవరున్నారో చూడాలి మరి!

## చిత్రసమీక్ష

(9 పేజీ తరువాయి)

పాట ఆకట్టుకోలేక పోయిందని తలచి కాబోలు బాబుమోహన్‌కు హీరోయిన్ సౌందర్యతో ఒక వాన పాట కూడా పెట్టి హీరోను డమ్మీ చేశారు.

బాబూమోహన్ - ప్రత్యేక మాటల మేనరిజం, అలీ ఫేస్ ఫీలింగ్, బ్రహ్మానందం ఒకే తరహా యాక్షన్‌లతో ఆక్కడక్కడా ప్రేక్షకులు కడుపుబ్బా నవ్వుకోవచ్చు. 'హలో' అని హీరోయిన్ అంటే 'పోలో' అని హీరో అనడం, నవ యువకుడా —అర యువకుడా; బాబుమోహన్ ఎందుకు ఏమిటి, ఎలా? సందేహాలు — బ్రహ్మానందం పిస్టల్‌కు బలయ్యే ప్రముఖుల మూగజీవాల డ్రామా; మందులేని జబ్బొచ్చి వస్తాన్ అనే నిర్మలమ్మ శాపనార్థాల్లో మాటల రచయిత దివాకర బాబు కష్టం ఫలించి ప్రేక్షకులు ఎంజాయ్ చేయగలరు 'నీ మాయలోడిని నేనే' 'చినుకు చినుకు' పాటల్లో సుచిత్ర చక్కని డాన్స్ కంపోజ్ చేసింది. పాపం బాబుమోహన్ కూడా బాగా కష్ట పడ్డాడండీ!

రాజేంద్ర ప్రసాద్‌కు ఇది వెరైటీ పాత్రయినా జోరుగా లాగించేశాడు. సౌందర్య చిందులకే సరిపోయింది. కోట శ్రీనివాస రావు ఏ పాత్రకైనా 'సై' అన్నట్లని పించారు. బేబి నికిత ముఖారవిందంలో అందం తప్ప ఫీలింగ్స్ రాబట్టడంలో దర్శకుడు ఫెయిల్ అయ్యారు. ఎస్.వి. కృష్ణారెడ్డి కథ, స్క్రీన్‌ప్లే, సంగీత, దర్శకత్వ బాధ్యతలు చేపట్టే ముందు ఉన్ని శాఖలకు న్యాయం చేకూర్చ గలనా అని ఒక నిమిషం ఆలోచించి వుంటే 'మాయలోడు' జనరంజకంగా వుండి వుండేదేమో!



**నెల్లూరు సబార్డినేట్ జడ్జి కోర్టులో**

OS.No. 276/1992

Between:-

M/s. Shriram Chits & Invest (P) Ltd, Rep. by its Branch Manager, Nellore. - Plaintiff

1. Sd. Nazeer Basha & 4 others - Defendants

5. S.M. Hussainy,S/o. Abdul Hussainy, Employee; Forest Range Office; Gudur, Nellore (Dt) - అను వారికి

**నోటీసు**

పైవారి పై ప్రతివాదులపై దావా పరిహారముల నిమిత్తమై OS No. 276/1992 అను దావాను దాఖలు చేసివున్నారు. ఆ దావా మీ నోటీసు నిమిత్తమై తే 7-9-93 దీకి వాయిదా వేయబడి వున్నది. కాన ఆరోజు ఉదయం 10.30 గంటలకు మీరు కోర్టు వారి యెదుట హాజరై ఆక్షేపణలు తెలుపుకొనవలయును. లేనిచో దావా మీ పరోక్షమున తీర్మానించబడును.

పేరేపి వేణు గోపాల్,
పి. సురేంద్ర,
వాది తరుపు అడ్వకేట్స్.

**ఒంగోలు డి.ము. కోర్టులో**

EP 99/89 in OS 104/73,

భీమనాదం పెదవెంకారెడ్డి - DHR. (వాది)

1కింటు సుబ్బారావు (died)వగైరా. JDRS. (ప్రతివాదులు)

**వేలం నోటీసు**

ఈ EP తో లీటు 2 వ JDR బబ్బూరి కోటయ్య తాలూకా దిగువ షెడ్యూ స్థిరాస్తిని యీ EP మొత్తము నకుగాను 6-9-93తేది ఉదయం 10-30గం.ల నుండి సాయంత్రం 5-00గం.ల లోపు పైకోర్టులో వేలం వేయుదురు గాన కావల్సిన వారు పాటలో పాల్గొని కొనుగోలు చేయవచ్చును.

షెడ్యూలు:- ప్రకాశం జిల్లా రిజిస్ట్రేషను ఒంగోలు సబ్‌రిజిస్ట్రేషను యిలాకా వెంగముక్కపాలెం గ్రామ సర్వే నెం. 57/2రులో య. 2-00 సెంట్లు లేక హె. 0.810లు మెట్ట భూమి. హద్దులు:- తూ. బబ్బూరి బ్రహ్మయ్య భూమి ద. పాలకూరి బసవయ్య భూమి ప. డొంక. వు. పూనాటి ముసలయ్య, రావిపాటి పున్నమ్మ గార్ల భూములు.

ఈ భూమి కిమ్మత్తు

.DHR వేసినది రు 5000/-

అమీనా వేసినది రు 15000/-

వేలం 6-9-93 తేది

F.H. 15-9-93తేది

పత్తిపాటి చలమయ్య
DHR అడ్వకేటు


**జమీన్‌రైతు**

సంవత్సర చందా రు 100/-
6 నె లలకు- రు.50/-
విడిప్రతి - రు. 2.00

# నవభారత నేతా – స్వాగతం!
# నవ్యభారత నిర్మాతా – సుస్వాగతం!!



నవభారత నిర్మాణానికి నవ్యరీతిలో శ్రమిస్తున్న
సమాజ సౌభాగ్యానికి అహరహం కృషి సల్పుతున్న
భారత ప్రధాని, అపర చాణక్యుడు, ఆంధ్రుల గర్వ కారకుడు

## శ్రీ పి.వి. నరసింహా రావు గారికి

స్వాగతం, సుస్వాగతం
మీ రాకతో పులకించి పోతున్నది నెల్లూరు నేల;
పరవశించి పోతున్నది నెల్లూరు ప్రజ!



పి. వసంత్ కుమార్ రెడ్డి

Edited, Printed and Published by N. Dolendra Prasad at Zaminryot Press. OFFSET Printing at Nayagara Paper Products (India) Ltd.,